# హిందీ ప్రమాణ పత్రవితరణోత్సవము,
# హైదరాబాదు.




ది 27.12.96న జరిగిన ప్రమాణపత్ర వితరణోత్సవము సందర్భంగా ప్రసంగించుచున్న
ముఖ్య అతిథి శ్రీ ఎమ్.వి.ఎస్. ప్రసాద్, I.A.S.,
సాంకేతిక విద్య, దేవాదాయ శాఖ కమీషనరు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము.

513

# స్రవ

సాహిత్య మాసపత్రిక

[illegible]

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శ

శ్రీ ఈమని దయానంద

[illegible]

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

బైరతాబాదు, హైదరాబాద్ - 500 004.

సంవత్సర చ

విడి ప్రతి
రూ. 4-00

Recommended for use in all the Public Libraries and School Libraries by the Director of Public Libraries, Andhra State, Madras Vide Proceedings Sl. No. 30/55 dated 6th January 1955.

---

# ఈ సంచికలో.....

# సంపాదకీయం



# తెలుగు - రాజ్యభాష

మన రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. మన రాజ్యభాష తెలుగు. అందుకు చట్టం అంగీకరింపబడి కూడా చాలా కాలమయింది. ఈ మధ్య కొన్ని జిల్లాలలో మహమ్మదీయుల సంఖ్య తగినంతగా వుండడం వలన ఉర్దూ భాషకు కూడా సముచిత స్థానం కల్పించబడింది. ప్రభుత్వ కార్యకలాపాలలో తెలుగు ఎలా ఉపయోగింపబడుతున్నదో పరిశీలించడానికీ, ప్రభుత్వానికి తగిన సలహాలివ్వడానికీ రాజ్యభాషా కమీషన్ కూడా నియమించబడింది. అది పనిచేస్తున్నట్లే లెఖ్ఖ. కాని కార్యాలయాలలో తెలుగు ప్రయోగం సున్నకు సున్న హళ్ళికి హళ్ళిగా ఉన్నది. ప్రజల భాషలో ప్రభుత్వ నిర్వహణ జరగవలెనని భావించి భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పర్చబడ్డవి. అందుకు విశేష త్యాగం చేసింది ఆంధ్ర రాష్ట్రం. శ్రీ పొట్టి శ్రీరాములు వంటి మహనీయుని బలిదానంతో గాని ఆంధ్రరాష్ట్రం ఏర్పడలేదు. తరువాత విశాలాంధ్రం కూడా ఏర్పడింది. తెలుగుభాషకూ, తెలుగు సంస్కృతికీ తగిన స్థానం లభిస్తుందని ఆశించడం జరిగింది. కాని క్రియలో ఆశించినవేవీ అమలు కావడం లేదు. చిత్తశుద్ధీ, ఇచ్ఛాశక్తీ వుంటేనేగానీ ఇటువంటి పనులు సక్రమంగా జరగవు. ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఇంగ్లీషు యెడల అభిమానం ఇంకా ఎక్కువవుతున్నది. గల్లీ గల్లీలో ఇంగ్లీషు మాధ్యమంలో పాఠశాలలు కుక్క గొడుగుల్లాగా వెల్లివిరుస్తున్నవి. కాన్వెంటు స్కూళ్ళ ప్రభావం పెరుగుతున్నది. ప్రభుత్వ కార్యకలాపాల్లో కూడా ఇంగ్లీషు ప్రభావం అంతకంతకూ ఎక్కువవుతున్నదేగాని తగ్గడం లేదు. ఇది స్థితి. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన ఎందుకు జరిగినట్లు? అన్ని రాష్ట్రాలలోనూ ఇదివరకంటే ఎక్కువగా ముఖ్యంగా నగరాలలో వివిధ భాషలు మాట్లాడేవారు నివసిస్తున్నారు. ప్రభుత్వ యంత్రాంగంలో కూడా ముఖ్యంగా ఉన్నత పదవుల్లో వివిధ భాషలవారు పనిచేస్తున్నారు. అది నిజమే. కాని అట్టి వారి సంఖ్య కొద్ది మాత్రమే. ఆ సాకుతో మూల సిద్ధాంతానికే విఘాతం కలిగించకూడదు గదా? ప్రజల భాషలో పరిపాలన జరగడం మూల సిద్ధాంతం గదా? అందుకు చిత్తశుద్ధితో పని జరగడం లేదు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన మొదటి రోజుల్లోనే, ముఖ్యంగా విశాలాంధ్రం ఏర్పడిన తరువాత ప్రభుత్వం తరపున తెలుగురాని ప్రభుత్వ కార్యకర్తలకు తెలుగు నేర్పించే ప్రయత్నం జరిగింది. కాని ఆ ప్రయత్నం జయప్రదమైనట్లు కనబడడం లేదు. తగిన కార్యక్రమంతో ఆ ప్రయత్నం జరిగినట్లుగా కూడా కనబడడం లేదు. భారత ప్రభుత్వం హిందీని రాజభాషగా అంగీకరించిన తరువాత ఇటువంటి సమస్యనే ఎదుర్కొన్నది. ప్రభుత్వ కార్యాలయాలలోని హిందీరాని కార్యకర్తలకొరకై హిందీ తరగతులు నడిపించింది. హిందీ నేర్చుకొనేవారికై అనేకమైన

ప్రోత్సాహకాలు కల్పించింది. చాలామంది హిందీరాని కార్యకర్తలు హింది నేర్చుకొన్నారు, నేర్చుకొంటున్నారు. హిందీలో పని కూడా ప్రారంభించారు. ఆంధ్ర ప్రభుత్వం అదే విధంగా తెలుగు రాని కార్యకర్తలకు తెలుగు నేర్పించే కార్యక్రమాన్ని ముమ్మరంగా అమలు చేయాలి. అది జరగనంత కాలం తెలుగులో పని జరగడం కష్టమే. భాషరాక వ్యతిరేకత పెరగడం కూడా సంభవం. కొంతమంది ఇంకొక భాష నేర్చుకొనడమెందుకని అశ్రద్ధతో తెలుగు నిర్వహణకు వ్యతిరేకంగా ప్రసంగాలు కూడా చేస్తుంటారు. అందువలన ఆ స్థితి ఏర్పడకుండా వీలైనంతగా తెలుగు రాని వారికి తెలుగు నేర్పించే ప్రయత్నం జరగాలి. ఇందుకు ప్రభుత్వం పూనుకోవాలి. అంతేగాక విద్యావిధానంలో కొద్ది మార్పులు జేసి పాఠశాలల్లో, కాలేజీలలో తెలుగు బోధనకు ప్రాధాన్యం కల్పించాలి. ఆనాడే ఎక్కువమంది తెలుగు నేర్చుకుంటారు. తెలుగులో బాగా పని చేయగలుగుతారు. తెలుగు రానివారికి తెలుగు నేర్పించటమటుంచి తెలుగు రాకుండానే తెలుగు జ్ఞానం లేకుండానే గ్రాడ్యుయేట్లు తయారయ్యే పరిస్థితి ప్రస్తుతం మన రాష్ట్రంలో ఏర్పడి వున్నది. ఈ మధ్యనే విశ్వ తెలుగు సమ్మేళనం జరిగిన సందర్భంలో ముఖ్యమంత్రిగారి దృష్టికి ఈ విషయం తీసుకొని రావడం జరిగింది. వారు పరిస్థితిని సరిదిద్దుతానని వాగ్దానం కూడా చేశారు. ఆ వాగ్దానం అమలులోనికి వస్తుందని ఆశిద్దాము. ప్రతి రాష్ట్రంలోనూ వివిధ భాషలు మాట్లాడేవారుంటారు. వారికి భారత రాజ్యాంగ చట్టం కొన్ని హామీలు కూడా ఇచ్చింది. వారు తమ భాషల్లో పాఠశాలలు నడుపుకొనవచ్చును. అందుకు ప్రభుత్వం సహాయం చేస్తుంది. చేయాలి. అయితే వారు తెలుగును ఉపేక్షించడం, ఇంగ్లీషులో వ్యవహారం నడిపిస్తామనడం న్యాయసంగతం కాదు. ఉచితంగాదు. తెలుగును అందరూ అభ్యసించే ప్రయత్నం చేయాలి. తెలుగునే కాదు, ఇంకా మరికొన్ని భాషల్ని నేర్చుకొన్నా మంచిదే. కాని తెలుగును ఏ విధంగానూ ఉపేక్షించకూడదు. తెలుగు మన రాజ్యభాష. ప్రజల భాష. ఆ భాషలో ప్రభుత్వం నడవాలి మన రాష్ట్రంలో అందుకు తగిన కృషి జరగడం లేదని చెప్పక తప్పదు. విద్యావిధానంలోనూ ప్రభుత్వ కార్యకలాపాలలోనూ తెలుగుకు విధిగా ప్రముఖ స్థానం లభించి తీరాలి. అది ప్రభుత్వం వారి పరమ కర్తవ్యం. అంతేగాక హిందీ సంస్థల వలె తెలుగులో కొన్ని సంస్థలు ఏర్పడి - పూనుకొని తెలుగు రానివారికి తెలుగు నేర్పించే ప్రయత్నం చేయాలి. కేవలం ప్రభుత్వం మీదనే బాధ్యతనంతా పెట్టడం కూడా మంచిది కాదు. తెలుగు సంస్థలు సాయంకాలపు తరగతులు నడిపించి, తేలికైన పాఠ్యక్రమాన్ని తయారుచేసి తెలుగు నేర్పించే ప్రయత్నం చేస్తే ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుంది. అటు ప్రభుత్వమూ స్వైచ్ఛిక తెలుగు భాషా ప్రచార సంస్థలూ శ్రద్ధ వహించి తెలుగు భాష అభివృద్ధికీ ప్రచారానికీ తోడ్పడగలవని ఆశిస్తున్నాము హిందీ వ్యాప్తికి హిందీ సంస్థలు అదే పని చేస్తున్నవి.

# ఆంధ్రభాషలో అన్యదేశ్యాలు - పరిశీలన

రచన : డాక్టర్ వి. సిమ్మన్న

**అన్యభాషా పదప్రయోగం :**

ఆంధ్ర సాహిత్యంలో అభివృద్ధిచెందిన వాఙ్మయ విశిష్టతల్లో, ప్రత్యేకతల్లో అన్యభాషా పదప్రయోగం ముఖ్యమైంది. ప్రయోజనాత్మకమైంది, విలువైంది కూడా. ఒక భాషకు ఇతర భాషలతో పరస్పర సంబంధం కలిగిన కొద్దీ ఆయా భాషల పదాలువచ్చి చేరడం పరిపాటి ఒక భాషయందలి పదాల్ని క్షుణ్ణంగా, సునిశితంగా, పరిశీలించి, పరిశోధించి దానిని ఇతర భాషలతో పోల్చిచూస్తే, ఆ భాషకుసహజమైన మూలరూపం ఏమిటో తేటతెల్లమవుతుంది.

**పదాలు ఎన్నిరకాలు? అవి ఏవి ?:**

ఏ భాషలోనైనా పదాలు రెండు రకాలుగా ఉంటాయి. 1. దేశ్యాలు, 2. అన్యదేశ్యాలు. మూల భాషల నుండి నిసర్గంగా / సహజంగా / సంక్రమించేవి దేశ్యాలు. మిగిలినవి అన్యదేశ్యాలు.

ఒక భాష వేరొక భాష నుంచి పదాలు స్వీకరించడాన్ని భాషాశాస్త్రజ్ఞులు 'ఎరువు' అని అంటారు. ఒక భాష వేరొక భాష నుంచి పదాల్ని 'ఎరువు' తెచ్చుకొనేటప్పుడు స్వభాషా వర్ణ నిర్మాణానికి అనుకూలమైన పద్ధతిలో పదాల్ని మార్చుకొని తనలో నిబిడీకృతం చేసుకుంటుంది.

**ఆంధ్ర వాఙ్మయం - అన్యభాషల ప్రభావం :**

ఆంధ్ర వాఙ్మయంపై అన్యభాషల ప్రభావం మొదటి నుంచి బాగా కనబడుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే అన్యభాషల ప్రభావంలేని భాష అంటూ ఏదీ ఈ ప్రపంచంలో లేదు. ప్రపంచంలో దాదాపు 5,000 భాషలున్నాయి. ప్రతిభాషపై అన్యభాషల ప్రభావం కొట్ట వచ్చేటట్లు దర్శనమిస్తుంది. ఇది ఏ భాషకూ మినహాయింపుకాదు. ఎంత ఎక్కువగా అన్యభాషాపదాల సంపర్కం ఉంటే అంతగా ఆ భాష ప్రపంచభాషలో అభివృద్ధి చెందినదని భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయం. దీనికి ప్రపంచంలో బహుళ ప్రచారం పొందిన ఆంగ్లభాషను ఉదాహరణంగా పేర్కొనవచ్చును.

ఒక జాతి వేరొక జాతిపై రాజకీయంగా, సాంస్కృతికంగా, సాంఘికంగా, మతపరంగా, ప్రభావం కలిగి వున్నట్లే ఒక భాషపై మరొభాష ప్రభావం కనబడుతుంటుంది.

**ఆదానప్రదానాలు - నిర్వచనం :**

ఆదానం : ఒక భాష నుంచి ఇంకొక భాషలోకి పదాల్ని స్వీకరించడాన్ని ఆదానం (Borrowing) అని అంటారు.

ప్రదానం : ఒక భాషనుంచి ఇంకో భాషకు పదాల్ని ఇచ్చినట్లయితే ప్రదానమంటారు.

ఆదానపదాలు, ప్రదానపదాలు రెండూ ఆయా భాషల్లో అన్యదేశ్యాలే అన్న విషయం మనం మరచి పోకూడదు. పై విషయాల్నిబట్టి తేలిన విషయం ఏమంటే ప్రతి భాషలో సాధారణంగా రెండు రకాలైన పదాలుంటాయి. 1. ఆదాన పదాలు, 2. ప్రదానపదాలు.

**ఆదానపదాలు - రకాలు :**

**చార్లెస్ హాకెట్ - ఆదానపదాలు - రకాలు :**

ప్రముఖ భాషాశాస్త్రజ్ఞుడు చార్లెస్ హాకెట్ (Charles Hockett) భాషలోని ఆదాన పదాల్ని రెండు రకాలుగా విభజించాడు.

Dip. in Sanskrit, Hindi, Tamil, Urdu & Linguistics, Lecturer in Telugu,
School of Correspondence Courses, Andhra University, Waltair 530 003

1. ఆవశ్యకతా పూరణం (Need - filling Motive)

2. ప్రతిష్ఠాత్మకపూరణం (Prestige Motive)

**1. ఆవశ్యకతా పూరణం (Need-filling Motive)**

ఒక భాష మాట్లాడేవారికి అంతకుపూర్వం పరిచయంలేని భావంతోకాని, వస్తువుతో కాని ఇతర భాషా సంపర్కంవల్ల పరిచయమైతే దానికి ఒక కొత్త పదరూపం అవసరమవుతుంది. సాధారణంగా అటువంటప్పుడు పర భాషలలో దాన్ని సూచించే పదాన్నే 'ఎరువు' తీసుకోవడం జరుగుతుంటుంది.

కేవలం అవసరంకోసం తెలుగుభాషలో అనేక ఆంగ్ల, పోర్చుగీసు, ఉర్దూ, సంస్కృత భాషాపదాలు చోటు చేసుకోవడం జరిగింది.

**i) ఆవశ్యకతాపూరణం కోసం తెలుగులో చేరిన ఆంగ్లపదాలు:**

ఉదా : రోడ్డు, రిక్షా, జీపు, కారు, బస్సు, లారీ, రైలు, పెన్ను, బాల్‌పెన్ను, పెన్సిలు, టి.వి. రేడియో మొదలైనవి.

ఆంగ్లంలోని 'F' అనే ధ్వని తెలుగులో 'ఫ' కారంగా వాడబడుతుంది.

| | | |
|---|---|---|
| ఉదా : Tiffin | - | |
| Fees | - | ఫీజు |
| Coffee | - | కాఫీ |
| Firang | - | ఫిరంగి |

అన్యభాషల వల్ల స్వభాషలోలేని కొత్త కొత్త జాతీయాలు కూడా ఏర్పడతాయి.

ఉదా : ఆంగ్లం - తెలుగు

Cold Looks - శీతకన్ను

"Cold Looks" అనేది ఆంగ్ల జాతీయం. ఆంగ్లేయులు ఈ జాతీయాన్ని చెడ్డ అర్థంలో ఉపయోగిస్తారు. ఆంగ్ల ప్రభావం వల్ల ఆంధ్రులు కూడా 'శీతకన్ను' అనే పదాన్ని చెడ్డ అర్థంలో ఉపయోగిస్తున్నారు.

**ii) పోర్చుగ్రీసు నుంచి వచ్చిన పదాలు :**

ఇంగ్లీషు వారికన్నా ముందు పోర్చుగీసువారు మనదేశంలో ప్రవేశించి దక్షిణ భారత రాజకీయాల్లో బాగా జోక్యం చేసుకోవడం వల్ల వారి భాష నుంచి కూడా కొన్ని పదాలు తెలుగుభాషలోకి వచ్చి చేరాయి.

ఉదా : అల్మార, అనాస, బొప్పాయి, బాల్చీ, కమీజు, ఇస్త్రీ, మేస్త్రీ మొదలైన పదాలు.

**iii) ఉర్దూ నుంచి వచ్చిన పదాలు :**

ఉదా : పసందు, షరతు, హాజరు, దర్యాప్తు, రొట్టె మొదలగు వందలకొలది పదాలు తెలుగులోకి వచ్చి చేరాయి.

**iv) సంస్కృతం నుంచి వచ్చిన పదాలు :**

ఉదా : రాజు, న్యాయం, ధర్మం, ఆత్మ, భవనం, పరిపాలన, గణితం మొదలైన పదాలు.

**v) తెలుగులో చేరిన సంస్కృత ప్రత్యయాలు :**

ఉదా : పనిమంతుడు
ఇబ్బందికరం
మేలుతరం
మతుప్, కరం, తరప్ ప్రత్యయాలు

**vi) తెలుగులో చేరిన ఫారసీ ప్రత్యయాలు :**

ఉదా : జమీన్‌దార్
జమాదార్
జాగీర్‌దార్
వ్యవసాయదారుడు

ఇక్కడ 'కలవాడు' అనే అర్థంవచ్చే 'దార్' అనే ప్రత్యయం ప్రయోగించబడింది.

**2. ప్రతిష్ఠాత్మక పూరణం (Prestige Motive) :**

అన్యభాషాపద ప్రయోగం గౌరవ ప్రదమనే భావంతో తమ భాషలో తగిన పదాలున్నా, వాని స్థానంలో అన్య భాషాపదాల్ని ఉపయోగిస్తుంటారు.

సంఘంలో ఉన్నతస్థానంలో ఉన్నవారి భాషను ప్రతిష్ఠకోసం ఇతరులు అనుకరించడం, అనుసరించడం సహజంగా జరుగుతుంటుంది. ఉన్నతస్థాయిలో ఉన్నవారు తమభాష కాకుండా వేరే భాష మాట్లాడేవారు కావచ్చు. అటువంటప్పుడు పాలకుల భాష లోని పదాల్ని నుడికారాల్ని పాలితులు తమ భాషలోకి యథాతథంగా తీసుకుంటారు.

ప్రతిష్ఠకోసం పాలకుల భాషాపదాల్ని పాలితులు అనుకరిస్తుంటారు. రాజభాషను ప్రాంతీయ భాషా వ్యవహర్తలు అనుకరించడం సర్వసాధారణమైన విషయం.

i) స్కాండినేవియన్ భాషనుంచి ఆంగ్లంలోకి వచ్చిన పదాలు:

తొమ్మిది - పదకొండు శతాబ్దాల మధ్య ఇంగ్లండుపై డెన్మార్కు దేశస్థులు దండయాత్రలు జరిపారు. ఈ కారణంగా ఇంగ్లీషు భాషలోకి డెన్మార్కు దేశీయుల భాష అయిన స్కాండినేవియన్ నుంచి అనేక పదాలు వచ్చిచేరాయి.

ఉదా : They, Them, Their
Are, Call, Die, Egg, Law
Sister, Skirt, Skin, Sky

ii) ఫ్రెంచి భాషనుంచి ఆంగ్లంలోకి వచ్చిన పదాలు :

పన్నెండు - పద్నాలుగు శతాబ్దాల మధ్య ఫ్రెంచివారు ఇంగ్లాండును పరిపాలించారు. ఈ కాలంలో వందలకొద్ది ఫ్రెంచిపదాలు ఇంగ్లీషులోకి వచ్చిచేరాయి.

| ఉదా : ఫ్రెంచి | - | ఆంగ్లం |
|---|---|---|
| Chamber | - | Room |
| Aannual | - | Yearly |
| Cordial | - | Hearty |

పాలితులు పాలకుల్ని భాషలోనేకాక ఆచార వ్యవహారాల్లో కూడా అనుకరిస్తారు. ఆచార వ్యవహారాల్లో ఉన్న తుల్ని అనుకరిండం వల్లే భాషలో ఆదానం జరుగుతుందని చెప్పవచ్చు.

ఫ్రెంచి భాషా ప్రభావం వల్ల ఇంగ్లీషులో ఆహారంగా ఉపయోగించే జంతువు మాంసానికి ఫ్రెంచిపేర్లు వచ్చాయి. ఇంగ్లీషు మాటలు జంతువుల పేర్లుగా మాత్రమే మిగిలాయి.

| ఉదా : ఆంగ్లం | - | ఫ్రెంచి |
|---|---|---|
| Ox | - | Beef |
| Calf | - | Yearly |
| Cordial | - | Hearty |

ఈ జంటల్లో రెండో పదం ఫ్రెంచిపదం.

iii) ప్రతిష్ఠకోసం తెలుగులో చేరిన పదాలు :

శాతవాహనుల పరిపాలనకాలంలో ప్రాకృతం, మహమ్మదీయుల పరిపాలనా కాలంలో ఫారసీ, అరబ్బీ, పర్షియన్, ఆంగ్లేయుల పరిపాలనాకాలంలో ఆంగ్లం రాజభాషలు అయిన కారణంగా ఆయాభాషా పదాల్ని ప్రతిష్ఠ కోసం మన ఆంధ్రులు వ్యవహరించండం జరిగింది.

| ఉదా : తెలుగు | - | ఆంగ్లం |
|---|---|---|
| అమ్మ | - | మమ్మీ (Mummy) |
| నాన్న | - | డాడీ (Dady) |

'అమ్మ' అనడానికి ఆంగ్లంలో 'మమ్మీ' అనీ, 'నాన్న' అనడానికి ఆంగ్లంలో 'డాడీ' అనీ అంటారు ఇందుకు కారణం గౌరవభావం మాత్రమే.

ఆంధ్రులు ప్రతిష్ఠకోసం ఫారసీపదం 'రోజ్'ను 'రోజు' గా వాడుతున్నారు.

తెలుగు కవులు దీర్ఘ సంస్కృత సమాసాల్ని ప్రయోగించటం కూడా గౌరవభావం చేతనే అని చెప్పడం అతిశయోక్తి కాదేమో?

ఉదాహరణ .

1. మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్యసం
పదలోనింగొనివచ్చి యిచ్చి ముదమొప్పంగాంచె
సేవించి ర
య్యుదయాస్తాచలసేతు శీతనగ మధ్యోర్వీపతుల్
సంతతా
భ్యుదయున్ ధర్మజు దత్సభాస్థితు జగత్పూర్ణ
ప్రతాపోదయున్
-నన్నయ - 19 ప. 1 ఆ. సభాపర్వం.

ఆటజని కాంచె భూమిసురుడంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లు రదభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుటనటనారూప పరిపుల్ల కలాపకలాపి జాలమున్
గటక చరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్
- మనుచరిత్ర - 2, 3

చార్లెస్ హాకెట్ చెప్పిన విధానాలే కాక మరికొన్ని రకాలుగా ప్రతిష్ఠకోసం తెలుగులో పదాలువచ్చి చేరడానికి అవకాశం ఉంధని ఆచార్య పి.ఎన్. సుబ్రహ్మణ్యంగారు చెప్పారు :

i) ప్రతిష్ఠకోసమే కాకుండా సభ్యతను సూచించే ఉద్దేశంతోకూడా మనం ఇతర భాషా పదాల్ని వాడుతూ ఉంటాం.

ఉదా : 'ఉచ్చ' అనడానికి బదులు సంస్కృత పదమైన 'మూత్రం' కానీ, ఇంగ్లీషు పదమైన 'Urine' కానీ, వాడుతున్నాం. ఇటువంటివే భార్య - భర్త - సంభోగం - మలం - మొదలైనవి.

ii) ఉన్నతస్థాయిలోని వారు పరభాషా వ్యవహర్తలు కాక, దేశభాషా వ్యవహర్తలే అయినప్పుడు వారి మాండలికంలోని పదాలు ఇతర మాండలికాలలోకి వ్యాపిస్తాయి.

ఉదా : కూడు, బువ్వ, అన్నం, భోజనం, ఇంటివద్ద, ఇంటికాడ, ఇంటిదగ్గర మొదలయినవి.

iii) సభల్లోను, సంభాషణల్లోనూ, ఉపన్యాసాల్లోనూ విద్యావిషయక చర్చల్లోనూ ప్రతిష్ఠాపూరకమైన ఇతర భాషా పదాల్ని దేశ్యపదాలకు బదులుగా వాడుతారు

ఉదా : మిమ్మలిని చూడడానికి వచ్చాను.
తమ దర్శనానికి వచ్చాను.
పిలుపు - ఆహ్వానం
పెళ్ళి - వివాహం.

## బ్లూమ్‌ఫీల్డ్ - ఆదానపదాలు - రకాలు :

సుప్రసిద్ధ భాషాశాస్త్రవేత్త బ్లూమ్‌పీల్డ్ (Bloon Field) అనే అతడు పదాల ఆదానాల్ని మూడు విధాలుగా (Three types of Borrowing) వర్గీకరించాడు.

1. సన్నిహిత ఆదానం (Intimate Borrowing)
2. సాంస్కృతిక ఆదానం (Cultural Borrowing)
3. మాండలిక ఆదానం (Dialect Borrowing)

### 1. సన్నిహిత ఆదానం (Intımate Borrowing) :

భౌగోళిక సాన్నిధ్యం వల్ల జరుగు ఆదానం సన్నిహిత ఆదానం. ఒకే భౌగోళిక ప్రదేశంలో (Geographical area) రాజకీయ కారణాలవల్ల ఆ ప్రదేశానికి సంబంధించిన భాషతోపాటు ఇతర భాషలు వ్యవహరించబడినప్పుడు, ఆ భాషలలోని పదాలు, స్థానిక భాషలోనికి ప్రవేశించి ఆదాన ప్రక్రియకు లోనుగావడం సంభవిస్తుంది.

ఆంధ్రులకు తమిళ, కర్ణాటక, మహారాష్ట్ర, ఒరిస్సా మొదలైన ప్రాంతాలతో భౌగోళికంగా సన్నిహిత సంబంధం ఉంది. ఈ కారణాలవల్ల తెలుగుభాషపై తమిళ, కన్నడ, మరాఠీ,ఒరియా భాషల ప్రభావం స్పష్టంగా కన్పిస్తున్నది.

i) తమిళపదాలు :

చిత్తూరు, నెల్లూరు జిల్లాలు తమిళనాడుకి దగ్గరగా ఉండటంవల్ల ఈ జిల్లాల్లోని తెలుగుభాషలో తమిళ పదాలు చేరాయి.

ఉదా : సాంబారు,సాపాటు,వడ,ఆళ్వారు,కనకపిళ్ళై.

ii) కన్నడ పదాలు :

అనంతపురం, కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాలు కర్ణాటక రాష్ట్రానికి సరిహద్దు ప్రాంతాల్లో ఉన్నాయి కాబట్టి ఈ జిల్లాలలోని తెలుగుభాషలో చాలా కన్నడ పదాలుచేరాయి.

| | | | |
|---|---|---|---|
| ఉదా: | పుంటికూర | - | గోంగూర |
| | బాడుగ | - | అద్దె |
| | బాలేపండు | - | అరటిపండు |
| | మడక | - | నాగలి |

iii) మరాఠీపదాలు :

ఆదిలాబాద్, నిజామాబాద్ జిల్లాలు మహారాష్ట్ర సరిహద్దులో ఉన్నాయి కాబట్టి మరాఠీపదాలు తెలుగుభాష లోకి వచ్చిచేరాయి.

ఉదా : కులకర్ణి, చెకడాబండి, గెడంచు

iv) ఒరియాపదాలు :

విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలు ఒరిస్సా రాష్ట్రానికి సరిహద్దులో ఉన్నాయి కాబట్టి అనేక ఒరియా పదాలు తెలుగుభాషలో ప్రవేశించాయి.

| | | | |
|---|---|---|---|
| చేప | - కుక్క; | కంబారి | - నౌకరు |
| పెయ్యి | - దూడ; | బుగత | - యజమాని |
| ఉభాలు | - ఊడ్పులు; | పైన | - దువ్వెన |
| భొగట్టా | - సమాచారం, | రేక | - చేద |

2. సాంస్కృతిక ఆదానం (Cultural Borrowing) :

భారతీయులు, విదేశీయుల సంస్కృతి గొప్పదనే భావంతో వారి సంస్కృతిని అనుసరిస్తూ అనుకరిస్తూ వారి పదజాలాన్ని 'ఎరువు'గా తెచ్చుకొంటారు. దీన్ని బ్లూమ్ ఫీల్డ్ సాంస్కృతిక ఆదానం అనిఅంటారు.

ఈ ఆదాన ప్రక్రియ అనేది రెండు వేరువేరు భాషా ప్రాంతాలకు సంబంధించింది. ఒక భాషా ప్రాంతానికి సంబంధించిన వ్యక్తి తన పొరుగుభాషలో పుష్కలంగా ఉన్న సంస్కృతిపరమైన పదజాలాన్ని తన అవసరం కొద్దీ గ్రహించడం సహజం.

మతం, న్యాయం, పరిపాలన, నాగరికత, వేషం, కళలు, యాంత్రికత మొదలైన అంశాలన్నీ సంస్కృతికి సంబంధించిన అంశాలు. వీటికి సంబంధించిన భాషాంశాలు ఇరుగు పొరుగు భాషల్లో పరస్పర మార్పిడిపొందే అవకాశం కలిగి ఉంటాయి.

ఇరుగు పొరుగు భాషలైన తమిళం, కన్నడం, మరాఠీ, ఒరియాభాషల సాంస్కృతిక పదాలు అనేకం తెలుగులో చేరాయి.

i) తమిళం నుంచి వచ్చిన సాంస్కృతిక పదాలు :

ఉదా . తిరుచూర్ణం, ఏళ్ళై మొ॥

ii) కన్నడం నుంచి వచ్చిన సాంస్కృతిక పదాలు :

ఉదా : హంగు, హొయలు, హోళిగలు, బేడలు మొ॥.

iii) మరాఠీ నుంచి వచ్చిన సాంస్కృతిక పదాలు :

ఉదా పేట్. లోటా

iv) ఒరియా నుంచి వచ్చిన సాంస్కృతిక పదాలు :

ఉదా . పన్నె (Comb) బుగత, బోగట్టు, కంబారి. మొ॥.

ఉర్దూ, ఆంగ్లభాషల నుంచి కూడా తెలుగులోకి సాంస్కృతిక ఆదానం జరిగింది.

i) ఆంగ్లం నుంచి తెలుగులోకి చేరిన సాంస్కృతిక పదాలు :

ఉదా : లాంతరు, లాయర్.

ii) ఉర్దూ నుంచి తెలుగులోకి చేరిన సాంస్కృతిక పదాలు :

ఉదా : కలం, కాగితం, కమీజు.

ఇదే విధంగా సాంస్కృతాదానంవల్ల అరబిక్, పారసీ, పోర్చుగ్రీసు, ఫ్రెంచి పదాలు తెలుగులో చేరాయి.

ఉదా : మసీదు, నవాబు
అల్లా, అమీరు.

### 3. మాండలికాదానం : (Dilect Borrowing) :

ఒకే భాషకు చెందిన మాండలికాల మధ్య జరుగు 'ఆదానం' మాండలికాదానం.

ఉదా : గల్లీ, నల్లా, నాసా, ఫికర్, వంటి పదాలు తెలంగాణా మాండలికపదాలు, ఈ తెలంగాణా మాండలిక పదాల్ని సముద్ర ప్రాంతంవారు వాడుచున్నారు.

సముద్రతీరం నుంచి రాయలసీమ వలస పోయిన వారు మోట / కపిల / వంటి పదాల్ని వ్యవహరిస్తున్నారు.

భాషాశాస్త్రజ్ఞులు ఆదానాల్ని మరికొన్ని విధాలుగా విభజించడం జరిగింది.

| | |
|---|---|
| 1. ఉచ్చారణ సంబంధమైన ఆదానం | (Pronounciation Borrowing) |
| 2. పదాదానం | (Lexical Borrowing) |
| 3. ఆదాన మిశ్రరూపాలు | (Loan Blends) |
| 4. ఆదాన విక్షేపాలు | (Loan Shifts) |
| 5. ఆదాన సృష్టాలు | (Loan Creatives) |
| 6. అనూదితాదానాలు | (Loan Translations) |
| 7. వికృతరూప ఆదానాలు | (Assimilated Loan Words) |
| 8. సహజరూప ఆదానాలు | (Unassimilated Loan Words) |
| 9. ఆదాన సంకర పదాలు | (Hybrid forms) |
| 10. ఆదాన పునరుక్తులు | (Repetitive Loan Words) |

### 1. ఉచ్చారణ సంబంధమైన ఆదానం (Pronounciation Borrowing) :

భిన్నభాషా సమాజాలు, కొన్ని కారణాలవల్ల ఒక సమాజంగా మారినప్పుడు విదేశీయులు దేశీయ పద జాలాన్ని, దేశీయులు విదేశీపదజాలాన్ని ఎవరికి తోచిన విధంగా వారు ఉచ్చరిస్తుంటారు.

ఉదా : విదేశీయులు, దేశీయపదమైన

తిరుచిరాపల్లి ని 'ట్రిచ్చి' అనీ,

తిరునెల్వేలి ని 'టిర్నె వెల్లి' అనీ ఉచ్చరిస్తున్నారు

స్వదేశీయులు విదేశీపదాల్ని

'రోడ్' (Road) ని రోడ్డు అనీ,

'స్కూల్' (School) ని (ఇ) స్కూల్ అనీ,

'హాస్పిటల్' (Hospital) ని ఆసుపత్రి అనీ ఉచ్చరిస్తున్నారు

### 2. పదాదానం (Lexical Borrowing) :

అన్యదేశ్యాల్ని తమభాషకు సహజమయ్యేట్లు మూలభాషకి సమీప ఉచ్చారణతో ఉచ్చరిస్తారు.

ఉదా :

| | |
|---|---|
| ఎక్సర్‌సైజ్ పుస్తకం | - Excercise Book |
| లింగ్విస్టిక్సు పాఠ్యగ్రంథం | - Linguistics Text Book |
| గవర్నమెంటు వైద్యశాల | - Government Hospital |
| హోటల్ భోజనం | - Hotel meal |

### 3. ఆదానమిశ్రరూపాలు (Loan Blends)

సమస్త రూపంలో ఒక భాగం దేశ్యంగా ఉండి, మరోభాగం అన్యదేశ్యంగా ఉంటే అట్టి రూపాన్ని 'ఆదాన మిశ్రరూపం' అని అంటారు. మన పూర్వ వైయాకరణులు చెప్పిన వైరసమాసం 'కఱకంఠుడు' వంటివి దీని క్రిందకు వస్తాయి.

ఉదా :

అనేక సార్లు

అనేక రకాలు

అనేక మారులు

పటలో మొదటి పదం సంస్కృతం రెం..
తెలుగు.

చావు కబురు : తెలుగు - ఉర్దూ

చావు కబురు

మైలురాయి : ఆంగ్లం - తెలుగు

మైలు రాయి

**4. ఆదాన విక్షేపాలు** (Loan Shifts) :

భాషలో ఉన్న ఒక పాతపదానికి కొత్త అర్థం కల్పించి వాడడాన్ని ఆదాన విక్షేపం అని అంటారు. దీనినే ఆదాన పరివృత్తాలు అని కూడా అంటారు.

ఉదా : 'విద్యుత్తు' అనే పదానికి అసలు అర్థం 'మేఘాల్లో పుట్టే మెరుపు'. దీన్ని ఇప్పుడు Electricity అనే అర్థంలో వాడుతున్నాం.

'ఆకాశవాణి' అనే పదానికి అసలు అర్థం 'ఆకాశంలో ఎవరో దేవత పలికే పలుకులు. అది ఇప్పుడు రేడియో ద్వారా వినిపించే ధ్వనులకు పర్యాయంగా వాడబడుతున్నది.

'సూది' అనే పదాన్ని ఆంగ్ల భాషా ప్రభావం వలన దేశీయార్థమైన 'సిట్టింగ్‌నీడిల్' అనే అర్థంతోపాటు 'ఇంజక్షన్' అనే అర్థంలోకూడా వాడుతున్నారు. సూది అనే పదానికి తొలుత సిట్టింగ్ నీడిల్ అనే అర్థం ఉండేది. ఆంగ్లభాషా ప్రభావంవల్ల ఇంజక్షన్ అనే అర్థాన్ని కూడా సంతరించుకుంది కనుక ఇది ఆదాన విక్షేపం.

'ప్రసారం' అనే పదం Radio Broadcost అనే అర్థంలో ప్రయోగిస్తున్నాం కనుక ఇది కూడా ఆదాన విక్షేపమే.

రైలు (Rail) ఆంగ్లంలో పట్టాలకు కూడిన పదం. తెలుగులో ఆ పట్టాల మీద నడిచే బండికి వాడబడుతున్నది.

| | | |
|---|---|---|
| కాగితం | - పత్రం | - అగ్రిమెంట్ |
| తీగ | - తంతి | - టెలిగ్రాం |
| బెల్ కొట్టే గంత | - గంట | - టైమ్ |
| గాజు | - అద్దాలు | - స్పెక్టికల్స్ మొదలైన |

పదాలిట్టివే.

**5. ఆదాన సృష్టాలు** (Loan Creations) :

భిన్నభాషా ప్రభావాలవల్ల భిన్న భాషలకి సమానమైన నూతన పదరూపాలు ఆయా భాషల్లో సృష్టించబడితే అవి ఆదాన సృష్టాలనబడతాయి.

ఆదానపదాలకి నూతన పదాల్ని స్వభాషలో సృష్టించు కోవడం జరుగుతుంది. భిన్న భాషాపదాల్ని తన భాషకి స్వతసిద్ధమైన పదజాలంతో తద్భిన్న భాషాపదాల్ని సృష్టిస్తే ఆదాన సృష్టాలనబడతాయి.

| ఉదా : | తెలుగు | - | ఆంగ్లం |
|---|---|---|---|
| | అగ్గిపెట్టె | - | Match Box |
| | పాలకాగితం | - | White Paper |

Match - అగ్గి, Box - పెట్టె 'Match'అనే పదానికి తెలుగులో అగ్గి అనే సమానార్థకం ఇవ్వబడింది. ఇది సరైన సమానార్థకం కాదు. శబ్దానువాదంకాక అర్థానువాదాన్ని పాటించటంవల్ల 'అగ్గి' అనే సమానార్థకాన్ని ఇవ్వటం జరిగింది. కాబట్టి ఇది ఆదాన సృష్టం.

White - తెల్ల, Paper - పత్రం. ఇక్కడ Paper అంటే పత్రం అనే అర్థం ఇవ్వబడింది. పత్రం అంటే పూర్తి వివరణతో కూడిన అధికార పత్రమని అర్థం. 'తెల్లని కాగితం' అనేది పదపదానువాదమవుతుంది. దీనినే 'పాల కాగితం' అని కూడా అంటారు. అందువల్ల ఇది ఆదాన సృష్టమవుతుంది.

**6. అనూదిత ఆదానాలు** (Loan Translation) :

ఒక భాషను మరో భాషలోకి అనువదించునప్పుడు వచ్చు ఆదానం అనూదిత ఆదానం. దీనినే 'ఆధ్యాన భాషాంతరీకరణం' అని కూడా అంటారు.

ఉదా :

| | |
|---|---|
| Round table conference | - గుండ్రబల్ల సమావేశం |
| Summit Talks | - శిఖరాగ్ర సమావేశాలు |
| Black Market | - నలబజారు |

| | |
|---|---|
| Black Money | - నల్లడబ్బు, నల్లధనం |
| Television | - దూరదర్శిని |
| Telephone | - దూరశ్రవణం |
| Wireless System | - నిస్తంత్రీ విధానం |
| Tablet | - గోలీ, మాత్ర, బిళ్ల |
| Capsule | - గొట్టం |
| Income Tax | - ఆదాయం పన్ను |
| Sales Tax | - అమ్మకం పన్ను |
| Penfriend | - కలం స్నేహితుడు లేదా కలం స్నేహితురాలు |
| Family Planning | - కుటుంబ నియంత్రణం |
| Programme | - కార్యక్రమం |

అనూదిత ఆదానాలను మరల 3 రకాలుగా భాషాశాస్త్రజ్ఞులు విభజించారు.

i) సక్రమాదాన అనువాదాలు (Proper Loan Translation)

ii) ఆదానభావానువాదాలు (Loan Renditions)

iii) ఆదాన స్పష్టాలు (Loan Creatives)

**i) సక్రమాదాన అనువాదాలు** (Proper Loan Translations)

ఒక భాషనుంచి మరోభాషలోకి అనువాదం సక్రమంగా జరిగితే, అది సక్రమాదాన అనువాదం.

ఉదా :

| | |
|---|---|
| ఐక్యరాజ్యసమితి (ఐ.రా.స.) | - United Nations Organization (U.N.O.) |
| చిత్తుకాకితాల బుట్ట (చి.కా.బు.) | - Waste Paper Basket (W P.B.) |

ii) ఆదానభావానువాదాలు (Loan Penditions)

మూలభాషలోని పదార్థాన్ని మాత్రమే గ్రహించి ఏ భాషలోకి ఆపదం అనువదింప వలసివుందో ఆ భాషకి సంబంధించిన సమానార్థకాల్ని తయారుచేయడం ఆదాన భావానువాదం అవుతుంది.

| | |
|---|---|
| ఉదా : చలువజోడు | - Cooling Glasses |
| ముద్రారాక్షసం | - Printing Mistakes |
| పడక కుర్చీ | - Easy Chair |

ఈ సమస్త రూపాల్లో సగభాగం పదానువాదం చేయబడింది. తక్కిన భాగానికి స్వతంత్రానువాదం చేయబడింది.

Cooling Glasses - చలువజోడు ఇక్కడ Cooling అనువదించబడి ఆంగ్ల పదానికి తెలుగుపదం సృష్టించబడింది.

iii) ఆదానస్పష్టాలు (Loan Creatives)

విదేశీపదాల నమూనాలను ఆధారంగా గ్రహించి స్వదేశపదాల్లో అదే అర్థం వచ్చేటట్లు అమర్చబడిన రూపాలు ఆదాన స్పష్టాలనబడతాయి.

| | |
|---|---|
| ఉదా : ఉపకారవేతనం | - Scholarship |
| రోదసీనౌక | - Rocket |
| వ్యోమగామి | - Astronaut |

**7. వికృతరూప ఆదానాలు** (Assimilated Loan Words)

ఇతర భాషల నుంచి వచ్చిన పదస్వరూపం పలుమార్పులకు గురియై ప్రవేశించినవి వికృతరూప ఆదానాలు

ఉదా :

| | |
|---|---|
| Hospital | - ఆసుపత్రి |
| Plaster | - పలస్త్రీ |

Desk - డసుకు

Glass - గళాసు

8. సహజరూప ఆదానాలు (Unassimilated Loan Words) :

ఎటువంటి మార్పులు చేర్పులు లేకుండా సహజంగా ఇతర భాషల నుంచి వచ్చిన పదాలు సహజరూప ఆదానాలు.

ఉదా Car - కార్

Doctor - డాక్టర్

Police - పోలీస్

9. ఆదాన సంకరపదాలు (Hybrid forms) :

ఇవి దేశ్య, అన్యదేశ్య భాషాపదాల కూడికచే ఏర్పడే సమస్తరూపాలు. ఇవి రెండు రకాలుగా ఉంటాయి.

i) అన్యభాషాపదాలు పరరూపంగా చేరే పదాలు.

ii) అన్యభాషాపదాలు పూర్వరూపంగా వచ్చే పదాలు.

i) తెలుగులో అన్యదేశ్యం పరంగా చేరిన పదాలు :

ఉదా : ఇనుప గేటు (Iron gate)

ii) అన్యదేశ్యం పూర్వంగా చేరిన పదాలు :

ఉదా : కరెంటు దీపం (Electric Lamp) or (Electric Light)

10. ఆదాన పునరుక్తులు : (Repetitive Loan Words) :

ఒకే పదం తెలుగు పర్యాయాలు పునరుక్తి అయితే అట్టి రూపాలు ఆదాన పునరుక్తులవుతాయి. అన్యదేశ్య పదం, దేశిపదం రెండూ ఒకే అర్థంలో ప్రయోగించబడ్డ సమస్తరూపం.

ఉదా: గేటు వాకిలి

డొపు తలుపు

సేటు పలక

బేగ్ సంచి

రైలు కమ్మలు

పక్క సైడు

అగ్గి నిప్పు

తెలుగులో చేరిన అన్యదేశ్యాలు లేదా ప్రతిదేయపదాలు (Loan Words) :

తెలుగుభాషలో తమిళం, కన్నడం, పారసీ, అరబ్బీ, హిందీ, ఉర్దూ, ఆంగ్లం, ఫ్రెంచి, పోర్చుగీసు, డచ్చి మొదలైన అన్యదేశ్యపదాలు వచ్చిచేరాయి

1. తెలుగులో చేరిన తమిళ పదాలు :

ఉదా . తిరుచూర్ణం, తిరునాళ్ళు, తంబి, అయ్యర్, సాపాటు, సాంబారు, వడ.

2. తెలుగులో చేరిన కన్నడ పదాలు :

ఉదా: కన్నడం - తెలుగు

హత్తు - హత్తు

హెచ్చు - హెచ్చు

హాళి - హాలి / క్రమం

హజ్జ - అజ్జ / అడుగు, పాదం

కెలస - కెలసం

కినిసు - కినియు

అరసు, గండపెండియరం, నంగనాచి, హోన్ను, దేవర, బేడలు, ఇల్లి, సాకు రాయరు మొదలైనవి.

3. తెలుగులో చేరిన ఉర్దూ పదాలు :

ఉదా : ఉర్దూ - తెలుగు

ఫేజు - ఫౌజు

ఫిరంగీ - పిరంగి

సుల్తాన్ - సుల్తాను

లహోర్, లాహోర్ - లాహిరి / సారా

| | |
|---|---|
| మస్జిద్ | మసీదు |
| మిజర్ | - మైజారు |
| షామ్‌నాయ్ | - సన్నాయి |

**4. తెలుగులో చేరిన మరాఠీపదాలు :**

| | |
|---|---|
| ఉదా : మరాఠీ | - తెలుగు |
| ఖంగార్ | - కంగారు |
| గోచీ | - గోచి |
| చాడీ | - చాడి |
| చావడీ | - చావడి |
| బిడార | - బిడారము, బిడారు |
| రామో, రాఓ | - రావు |

**5. తెలుగు భాషలో చేరిన యూరోపియన్ భాషా పదాలు :**

తెలుగుభాషపై ప్రభావం చూపిన యూరోఫియన్ భాషల్లో పోర్చుగీసు భాష మొదటిది. 1498లో పోర్చుగీసు వారు భారతదేశపు పశ్చిమ తీరంలోకి ప్రవేశించడంతో పోర్చుగీసుభాషకు తెలుగుభాషకు సంబంధాలేర్పడ్డాయి.

పోర్చుగీసువారు తమతోటి మనదేశానికి కొన్ని పళ్ళని, కాయలని తీసుకొని రావటం జరిగింది. కాబట్టి ఆ పదాల్ని సూచించే పదాలు కూడా తెలుగు భాషలో చేరాయి.

ఉదా : అనాస, బొప్పాయి, ఇలా వచ్చిన పదాలే. పోర్చుగీసుభాష నుంచి తెలుగులోకి వచ్చిన మరికొన్ని ఇతర పదాలు :

i) సైనిక సంబంధమైన పదాలు :

ఉదా : కపితాను, కమాను, పటాలము, సోల్జంతు.

ii) వస్త్ర సంబంధమైన పదాలు :

ఉదా : ఇస్త్రీ, కమీజు, కాజా, బొత్తము.

iii) వర్తక సంబంధమైన పదాలు :

ఉదా : కుంపిణి, కోస్తా, గిడ్డంగి, గోదాము, బంకు.

iv) గృహపరికరాలకు సంబంధమైన పదాలు :

ఉదా : బాల్చీ, పీపా, అల్మారా, మేజా, సబ్బు.

v. ఇతర పదాలు :

ఉదా : బిస్కతు, బాతు, మేస్త్రీ మొదలైనవి.

**6. తెలుగులో చేరిన ఆంగ్ల పదాలు :**

పోర్చుగీసువారి తర్వాత భారతదేశానికి వచ్చి సుస్థిర ప్రభుత్వాన్ని నెలకొల్పి తెలుగుభాషపై ప్రభావంచూపిన యూరోపియనులు ఆంగ్లేయులు.

ఈస్టిండియా కంపెనీవారు క్రీ.శ. 1600 లో ఎలిజబెత్తురాణి నుంచి భారత దేశంలో వ్యాపారం చేయడానికి అనుమతి సంపాదించి 18వ శతాబ్ది నాటికి తమ అధికారాన్ని ఇక్కడ నెలకొల్పారు.

ఆంగ్లేయులు వైజ్ఞానిక, సాంస్కృతిక, సాంఘిక రంగాల్లో అనేకమైన మార్పులు తెచ్చారు. దాని ఫలితంగా ఆంగ్ల పదాలనేకం తెలుగుభాషలో ప్రవేశించాయి.

i) నిత్యావసరాలకు సంబంధించిన పదాలు :

లైటు, స్విచ్చి, కాఫీ, రోడ్డు, బస్సు, కారు, పెన్ను మొదలైనవి.

ii) పరిపాలనా సంబంధమైన పదాలు :

కోర్టు, ఆఫీసు, ఆర్డరు, ఫైలు.

iii) సాంస్కృతిక పదాలు :

ఫ్యాషను, డాన్సు, సినిమా, ఫ్యాను, రేడియో, క్లబ్బు.

ఈ రీతిగా తెలుగు భాషలో ఇతర భాషాపదాలు ప్రవేశించాయి. ఏ భాషకైనా, ఇతర భాషల నుంచి పదాలు స్వీకరించటం, అలాగే ఇతర భాషలకు తన పదాల్ని ప్రదానం చేయటం సహజమైన లక్షణం.

**ప్రదాన పదాలు - రకాలు :**

ఇంతవరకు మనం ఇతర భాషలనుంచి తెలుగు భాషలోకి వచ్చిన పదాలను పరిశీలించడం జరిగింది.

ప్రస్తుతం తెలుగుభాష నుంచి ఇతర భాషల్లోకి ప్రవేశించిన పదాలను గూర్చి పరిశీలిద్దాం.

తెలుగుభాషలో ప్రవేశించిన పదాలు ఆదానాలు. తెలుగునుంచి ఇతర భాషలోకి ప్రవేశించిన పదాలు ప్రదానాలు.

**తెలుగు భాష నుంచి ఇతర భాషల్లోకి చేరిన పదాలు:**

తెలుగునుంచి ఆంగ్లంలోకి ప్రవేశించిన పదాలు :

| తెలుగు | - | ఆంగ్లం |
|---|---|---|
| బండి | - | Bandi |
| పందికొక్కు | - | Bandicoot |

తెలుగునుంచి మరాఠీ భాషలోకి ప్రవేశించిన పదాలు :

| తెలుగు | మరాఠీ |
|---|---|
| ఆటపాట | ఆటపాట |
| ఉండ | ఉండా |
| ఎలమ్మ | యలమ్మా |
| కాలవా | కాలవ |
| గడ్డ | గడ్డా |
| కొంప | కోంప |
| చెంబు | చంబూ |
| చుట్టి | చుట్టు |
| పైకము | పైకా |
| మంది | మాందీ |

ప్రాంతీయభాషల నుంచి ఇతర భాషల్లోకి చేరిన పదాలు:

తెలుగుభాష నుంచే కాక భారతీయ భాషలైన సంస్కృతం, హిందీ నుంచి కూడా అనేక పదాలు ఆంగ్ల భాషలోకి వెళ్ళాయి.

భారతీయ భాషల నుంచి ఆంగ్లంలోకి సుమారు 2000 పదాలు ప్రవేశించాయని భాషా పరిశోధకులు చెప్పుతున్నారు.

R.E. Hawkins గారు Common Indian Words in English అనే వ్యుత్పత్తి నిఘంటువును ప్రామాణికంగా వ్రాశాడు. దీనినే 1984లో Oxford University Press ముద్రించింది.

i) సంస్కృతం నుంచి ఇతర భాషల్లోకి చేరిన పదాలు :

| ఉదా : సంస్కృతం | - | ఆంగ్లం |
|---|---|---|
| అభినయ | - | Abhinaya |
| | | Advaita |
| భారత్ | | Bharat |
| బ్రహ్మచర్య | | Brahmacharya |
| యోగ | | Yoga |

ii) హిందీ నుంచి ఇతర భాషల్లోకి చేరిన పదాలు :

| ఉదా : హిందీ | ఆంగ్లం |
|---|---|
| | Aarati |
| ఆయారామ్ | Ayaram-Gayaram |
| గయారామ్ | |
| మా | Ma |
| మహారాజ్ | Maharaj |
| గురుకుల్ | Gurukul |
| హరిజన్ | Harijan |

# విక్రమోర్వశీయ కథాకాల పరిశీలన

సూర్యదేవర రవికుమార్

కవికుల గురువు, మహాకవి కాళిదాసు రచించిన నాటకత్రయమున 'విక్రమోర్వశీయము' ద్వితీయమని పండితుల అభిప్రాయము. కొన్ని ప్రతులలో నాటక ప్రారంభమున 'అనేన త్రోటకేన' అన్న సూత్రధారుని మాటలు కన్పించుట చేత ఇది త్రోటకమని కొందరి అభిప్రాయము త్రోటకము కూడా ఒక విధమైన నాటకమే దాని లక్షణమిది.

సప్తాష్టనవపంచాంకం దివ్యమానుషసంశ్రయమ్
త్రోటకం నామ ప్రత్యాహః ప్రత్యంకం సవిదూషకమ్

విక్రమోర్వశీయమున ఇతర లక్షణములు కలవు కాని విదూషకుని పాత్ర ప్రథమ, చతుర్థాంకములలో కన్పించదు. అయిదంకముల పరిమితిగల ఈ నాటకము లోని వివిధ అంకములలోని కథ ఎప్పుడు ప్రారంభమై ఎప్పటికి ముగిసినదో పరిశీలించటమే ఈ వ్యాసోద్దేశము. ఇందుకు వర్ణనలు, సంభాషణలు ముఖ్యాధారాలు.

## ప్రథమాంకము

ఊర్వశిని, ఆమె చెలియగు చిత్రలేఖను కేశి రాక్షసుడు అపహరించుకుపోగా అప్సరసలు రక్షించమని కేకలు వేయటంతో ప్రథమాంకము ప్రారంభమగును. ఊర్వశి కైలాసనాథుడగు కుబేరుని సేవించి తిరిగి వచ్చు చున్నదని సూత్రధారుడు, రంభల వచనముల వలన తెలియుచున్నది. ఇదే సమయమున పురూరవుడు సూర్యుని సన్నిధానం నుండి తిరిగి వస్తున్నాడు. (సూర్యోపస్థానాత్ ప్రతిని వృత్తం...) ఇది సూర్యోదయమై కొద్దికాలము గడచిన సమయము.

అప్సరసలు చెప్పగా జరిగిన వృత్తాంతమును విని రాజు రాక్షసుని బారినుండి ఊర్వశి, చిత్రలేఖలను విడిపించును. ఇంద్రుడు పంపగా చిత్రరథుడు వచ్చి రాజుకు కృతజ్ఞతలు తెల్పును. రాజు ఊర్వశిని రక్షించుట, అప్సరసల చిత్రరథుని సంభాషణలతో సుమారు రెండు గంటల కాలము గడచియుండును. కనుక, ప్రథమాంకము, సూర్యోదయమయిన పిదప ప్రారంభమై రెండు గంటల కాలము నడిచి ముగిసినది. ఈ అంకము నందలి సంఘటనలు ఏ ఋతువున జరిగినవో తెలిసికొనుటకు సరియైన ఆధారములు లేవు. ద్వితీయాంకమందలి సంఘటనలు వసంతకాల ప్రారంభమున జరిగిన వగుటచే ఇవి అంతకు కొద్ది కాలము ముందు జరిగియుండును.

## ద్వితీయాంకము

ఇది విదూషకుని ప్రవేశముతో ప్రారంభమగును. అతని మాటలవలన రాజు కొలువులో ధర్మాసనస్థుడైనట్లు తెలియును. ఇంతలో వైతాళికులు సమయమును తెల్పుదురు. 'తిష్ఠత్యేక క్షణమధీపతి ర్జ్యోతిషాం వ్యోమమధ్యే', 'సూర్యుడు ఆకాశమధ్యమున క్షణకాలము నిలిచినాడు' అను వైతాళికుల మాటలవలన అది మధ్యాహ్న సమయమని తెలియును. సూర్యుడు మధ్యాహ్న కాలమున క్షణకాలము విశ్రాంతి తీసుకొనునని శాస్త్రము చెప్పుచున్నది. అంతేకాదు 'షష్ఠీకాలే త్వమపి దివసస్యాత్మనః ఛందవర్తీ' అని కూడా వైతాళికుల వచనము. రోజులోని ఈ ఆరవ భాగాన్ని గూర్చి విద్వాంసులలో భిన్నాభిప్రాయాలున్నవి.

పశువైద్యశాల, పెదపులిపర్రు 522 257. గుంటూరు జిల్లా

ఆ సమయంలో రాజు కొలువు చాలించి విదూషకునితో కలిసి ఉద్యానవనమునకు వెళ్ళును. వారిద్దరి సంభాషణలలో విదూషకుడు వంటశాలలో జరుగుతున్న భోజన ఏర్పాట్లను ప్రస్తావిస్తాడు. ఇదికూడా మధ్యాహ్న సమయమునకే తగి ఉన్నది.

ఉద్యానవనాన్ని రాజు ఈ విధంగా వర్ణిస్తాడు.

'కిముత మలయవాతోన్మూలితాపాండు పత్రై

రుపవన సహకారై ర్దర్శితే ష్వంకురేషు' (2-6)

విదూషకుడు కూడా 'ప్రేక్షతాంభవాన్. వసంతావతార సూచిత మస్యాభిరామత్వం ప్రమదవనస్య' అని అంటాడు. ఈ మాటలవలన అది వసంతకాల ప్రారంభ సమయమని, చెట్లు చిగిర్చిన కాలమని గ్రహించవచ్చును. ఈ వసంతశోభనే రాజు మరల వర్ణిస్తూ (2-7) వసంతలక్ష్మి ముగ్ధత్వమునకు, యౌవనమునకు మధ్యగలదని వివరిస్తాడు.

రాజుపైగల ప్రేమతో ఊర్వశి చిత్రలేఖతో కలసి ఆ ఉద్యానవనమునకు వచ్చి అపరాజిత విద్యద్వారా రాజుకు, విదూషకునకు కనబడకుండ నిలిచి వారి మాటలు విని భూర్జపత్రముపై శ్లోకాన్ని వ్రాసి వారిముందర వైచి చివరకు చిత్రలేఖతో సహా రాజుకు దర్శనమిచ్చి సంభాషించును. ఈ సంభాషణ బహుకాలము సాగకుండ దేవేంద్రుని పిలుపు మేరకు ఊర్వశి స్వర్గమునకు వెళ్ళును తరువాత రాజు భార్య ఔశ్వరీదేవి వచ్చి ఊర్వశి వ్రాసిన భూర్జపత్రాన్ని చూచి కోపగించుకొని వెళ్ళిపోవును. విదూషకుడు రాజపత్నితో 'భవతి ! త్వరయస్వాస్యభోజనాయ. పిత్తోపశమనేన స్వస్థో భవతు' అనీ, అంకము చివర 'సమయఃఖలు స్నానభోజనం సేవితుమ్' అని చెప్పిన దానిని బట్టి రాజు ఆకాశంవైపు చూచి 'కథ మర్ధంగతం దివసస్య' అని అన్నదానిని బట్టి అప్పటికిమిట్టమధ్యాహ్నం దాటిందని, ఇంకా మధ్యాహ్న భోజనం కాలేదని స్పష్టము. కనుక ఈ అంకంలోని కథ మధ్యాహ్నం 12 గంటల ప్రాంతమున ప్రారంభమై సుమారొక గంటకాలము వరకు సాగినదని నిర్ణయించవచ్చును. అయితే, ప్రథమద్వితీయాంకముల మధ్య జరిగిన కాలాన్ని నిర్ణయించటానికి తగిన ఆధారములు లేవు.

## తృతీయాంకము

భరతశిష్యుల సంభాషణలతో ఈ అంకము ప్రారంభమగును. అందొకడు సూర్యునిచూచి 'కథాప్రసంగే నా పరార్ధాభిషేకవేలా' అన్నదానిని బట్టి అప్పటికి మధ్యాహ్న సమయం దాటినది. తర్వాత రంగస్థలంమీదకు వచ్చిన కంచుకి 'రమణీయఃఖలు దివసావసాన వృత్తాంతో రాజవేశ్మని' అనీ, 'సంధ్యామంగళదీపికా విభజతే శుద్ధాంత వృద్ధోజనః' అనీ చెప్పినదానిని బట్టి అది సాయం సంధ్యా కాలము. దీపాలు వెలిగించేవేళ. క్రమంగా చీకట్లు వ్యాపించటంతో రాజు వెంటగల పరిజనులు దీపాలను పట్టుకొనినట్లు వర్ణించబడింది రాజు సపరివారముగా మణిసౌధము మీద గల స్ఫటికమణి శిలాసోపానముపై కూర్చున్నపుడు విదూషకుడు 'ప్రత్యా'సన్నేన చంద్రోదయేన భవితవ్యమ్. యథాతిమిరేణాతిరిచ్యమానం పూర్వదిశా ముఖ మాలోహిత ప్రభం దృశ్యతే' అని చంద్రుడు ఉదయించబోయే స్థితిని వర్ణించును. దీనిని రాజుకూడా సమర్థించును. తరువాత చంద్రోదయమగుట, దీపికలను పట్టుకొని వున్న పరిజనులను రాజు విశ్రాంతిగై కొనుమని ఆదేశించుట జరుగును. కనుక ఆనాడు కృష్ణపక్ష పాడ్యమికాని విదియకాని అగును. తరువాత అభిసారికా వేషముతో ఊర్వశి చిత్రలేఖతో కలిసి రాజును చేరి అదృశ్యమైయుండును. ఇంతలో ఔశీనరీ దేవి వచ్చి తను చేయుచున్న వ్రతమును గూర్చి రాజుకు చెప్పి వెళ్ళిపోవును. ఊర్వశి రాజు కనులు మూయగా రాజామెను గుర్తించి మాట్లాడెను. విదూషకుడు 'సేవితాః ప్రదోషరమణీయాః చంద్రపాదాః' అన్న మాటననుసరించి అప్పటికింకా రాత్రి 9 గంటలు (జాము రాత్రి) దాటలేదని నిర్ధారించవచ్చును. ఇంతటితో ఈ అంకము ముగియును.

ఈ అంకమందలి కథ సూర్యాస్తమయ కాలమున ప్రారంభమై సుమారు రెండు గంటల కాలము జరిగియుండును.

రెండవ అంకమున గల కథ ముగిసిన తరువాత ఎన్నిరోజులకు మూడవ అంకమున గల కథ ప్రారంభమైన దను విషయమును గమనెంచవలసి యున్నది.

తృతీయాంకము చివర 'అపరాద్ధాస్మి విరహకారికా మహారాజస్య' (చాలకాలము మహారాజుకు విరహ దుఃఖము కలిగించుటచే అపరాథనైతిని) అను ఊర్వశి మాటలవలన ఆమె పురూరవుని కలిసి చాలకాలమైనదని తెలియును. ద్వితీయాంకము వసంతఋతువు ప్రారంభ కాలమున జరిగినదని తెలిసికొంటిమి. తృతీయాంకమున చిత్రలేఖ ఊర్వశిని విడిచివెళుతూ 'వసంతానంతర ముష్ణ సమయే భగవాన్ సూర్యో మయా ఉపరితవ్యః' అన్న మాట లనుబట్టి వసంతము వెళ్ళి గ్రీష్మము ప్రవేశించినట్లు గ్రహించగలము. విదూషకుడు 'అహమపి యదా శిఖరిణీం రసాలంచ నలభే తదా తదేవ చింతయన్ ఆసాదయామి సుఖమ్' అనును. శిఖరిణి అనగా సుగంధ ద్రవ్యములతో పక్వంచేసిన క్షీరవిశేషము. ఇక రసాలు (మామిడిపండ్లు) వసంతృతువు మధ్యను లభించును. విదూషకుడు కోరగానే రాజు వాటిని సమకూర్చెదనని చెప్పును. వీటినిబట్టి ద్వితీయ తృతీయాంకముల మధ్యకాలము సుమారు ఒకటిన్నర నెలలని గ్రహించవచ్చును.

## చతుర్థాంకము

ఇది సూర్యోదయమున ప్రారంభమగును. సూర్య కర స్పర్శవలన తామరపూవులు వికసించినవని మొదటి శ్లోకమున కలదు. ఇంతేకాక సహజన్య తూర్పువైపు చూచి చిత్రలేఖతో 'తదేహి. ఉదయాధిపస్య భగవతః సూర్య స్యోపస్థానం కుర్వః' అని ఉదయసూర్యుని సేవించవలయు నని చెప్పును. వీరిరువురి సంభాషణవలన ఊర్వశీ పురూర వులు గంధమాదన పర్వతముప విహరించుచుండగా రాజు ఉదయవతి అను విద్యాధర కన్యను చాలసేపు చూచుటచే కోపించి ఊర్వశి 'గురుశాపసంమూఢ' హృదయయై దేవతానియమమును మరచి కుమార వనమును ప్రవేశించి లతాభావాన్ని పొందినట్లు తెలియును. ఊర్వశిని వెదకుతూ ఉన్మత్తుడై తిరిగే రాజుకు మేఘోదయ ముతో వేదన ఇనుమడించినది.

తృతీయాంకమున చిత్రలేఖ 'ఉష్ణసమయ'మున తాను సూర్యుని సేవించవలయునని చెప్పను. ఈ అంక ప్రారంభ సంభాషణవలన ఆమె ఇంకా సూర్యుని సేవిస్తూనే ఉన్నట్లు స్పష్టము. అప్సరసలు క్రమమున సూర్యుని సేవించుట పౌరాణిక ప్రసిద్ధము. అప్పటికి ఇంకా ఉష్ణసమయము పూర్తి కాలేదు. క్రమముగా మేఘోదయము సూచించబడింది కనుక అది గ్రీష్మవర్షాకాల సంధి కావచ్చును. పురూరవుడు 'నవజలధర' మును చూచినట్లు చెప్పబడినది.

లతారూపాన్ని పొందిన ఊర్వశిని వెదకుతూ రాజు అనేక అహోరాత్రములు గడపెనని చెప్పబడినది. 'మధువా సరే క్రీడంతీ ధన్యా నదృష్టా త్వయా' అనే రాజు మాటల వలన ఊర్వశీపురూరవులు వసంతకాలము నుండి గంధమాదన పర్వతముపై విహరించినట్లు స్పష్టము. దీనికి 'మహాన్ ఖలుకాలః ఆవయోః ప్రతిష్ఠానాన్నిర్గతయోః' అన్న ఊర్వశి మాట ఉపబలకము.

పురూరవుడు ఊర్వశికై వెదకిన కాలమును స్పష్టముగ నిర్ణయించుటకు తగిన ఆధారములు లేవుగాని అంకమున వర్షాకాలసూచకమైన అనేక సందర్భములు, వర్ణనలు కన్పించుటచే నడివానాకాలం దాకా ఈ అన్వేషణ సాగినట్లు భావించవచ్చును.

రాజు గౌరీచరణ రాగసంభవమణి వలన ఊర్వశిని తిరిగి పొంది ఆమెతోకలిసి ప్రతిష్ఠానపురమును చేరుటతో ఈ అంకము ముగియుచున్నది.

## పంచమాంకము

ఇందలి కథ చతుర్థాంకమునందలి కథ ముగిసిన తర్వాత కొన్ని సంవత్సరములకు జరిగినది. ఈ కాలమున ఊర్వశీపురూవులకు ఆయువు పుట్టి యౌవనవంతుడైనాడు. 'ఉషితం త్వయా పూర్వస్మిన్ ఆశ్రమే. ద్వితీయ మధ్యాసితుం తవ సమయః' అన్న రాజు మాటలను బట్టి అప్పటికి ఆయువు వయసు సుమారు 16 సం॥లు అని భావించ వచ్చును. కనుక చతుర్థాంక కథ జరిగిన తరువాత 17 సం॥లకు పంచమాంక కథ జరిగినది.

విదూషకుని రాకతో ఈ అంకము ప్రారంభమగును. అతని మాటలవలన ఆ రోజు పర్వదినమని (తిథివిశేషః) తోచును. రాజు అలంకరణ గావించు కొనుచుండగా సంగమమణిని గ్రద్ధఎత్తుకు పోయినదని తెలిసి అసమాప్తా లంకారుడై బయటకు వచ్చును. ఆ సమయము ఉదయము సుమారు 8 గంటల ప్రాంతము కావచ్చును. చ్యవనాశ్రమ ప్రాంతమున ఆయువు ఆ గ్రద్దను కొట్టి మణిని గ్రహించును. చ్యవనుని ఆదేశంమేరకు తాపసి ఆయువును ఊర్వశీపురూరవులకు అప్పగించును. కుమారుని చూచిన ఊర్వశికి మహేంద్రుని శాపము గుర్తుకు వచ్చి ఏడ్చును. ఇంతలో నారదుడు వచ్చి ఊర్వశిని పురూరవుని వద్దనే ఉండిపొమ్మనును. ఇంద్రుని ఆజ్ఞను విన్పించి ఆయువునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేయించును. ఇంత తతంగము జరుగుటకు నాలుగైదు గంటలకాలము పట్టును. కనుక పంచమాంకకథ సూర్యోదయ సమయమున ప్రారంభమై మధ్యాహ్న భోజన సమయమునకు ముగిసినట్లు గ్రహించవచ్చును.

ఈ విధంగా విక్రమోర్వశీయనాటక కథను 17, 18 సంవత్సరముల కాలావధి గలదానినిగా కాళిదాసు రస వంతముగా చిత్రించాడు.

★★



# "తెలుగు - హిందీ భాషలలో సంస్కృత సమ శబ్దాల అర్థ విపరిణామము : ఒక పరిశీలన"

డా. శ్రీమతి ఇ. కామేశ్వరి

సంస్కృత భాష భారతీయ భాషలకు జనని. ముఖ్యముగా భారతీయ ఆర్యభాషలు సంస్కృతము నుండే ఉద్భవించినవి. భారతీయ భాషలన్నీ సంస్కృత పదాలను తమలో ఇముడ్చుకున్నాయి ఆవి ఎంతగా భాషలలో కలిసిపోయాయంటే వాటిని వేరుచేసి వాటి స్థానంలో వేరే పదమును చేర్చలేము. ఎందువలన అంటే ఒక్కొక్కప్పుడు సరైన పదమే దొరకదు. పదాలను సంస్కృతములో, హిందీలో శబ్దము అని అంటారు. శబ్దాలు (పదాలు) నాలుగు రకములు - తత్సమ శబ్దాలు, తద్భవ శబ్దాలు, దేశ్య శబ్దాలు, విదేశ శబ్దాలు. ఇక్కడ తెలుగు-హిందీలో వాడబడుతున్న తత్సమ శబ్దాలను గురించి వివరించి పరిశీలన చేయబడుచున్నది. 'తత్' అనగా సంస్కృతము 'సమ' అనగా సమానము అనగా సంస్కృత సమానము అని అర్థము. సంస్కృతము నుండి ఎటువంటి మార్పులేకుండా యథాతథంగా పదమును వాడడం 'తత్సమం' అంటారు.

వైదిక సంస్కృతము నుండి శబ్దాలు లౌకిక సంస్కృతములోకి వచ్చేసరికి వాటిరూపాల్లో, అర్థాల్లో మార్పు వచ్చినది. ఆదునిక సాహిత్యంలో శబ్దాల (పదాల) వాడుకని పరిశీలిస్తే మనకు చాలా ఆశ్చర్యం కలుగుతుంది. భాషకు మార్పు సహజం, కాలంతోబాటు, మనుష్యుల అవసరాలతో బాటు, భాష కూడా మారుతూ వుంటుంది. ఆధునిక రచయితలు వారి వారి రచనలలో కొన్ని పదాలను మూల భాషకి ఏమాత్రం సంబంధం లేకుండా పూర్తిగా భిన్నార్థంలో వాడుతున్నారు. ఈ మార్పు అన్నది ఒకటి లేక రెండు రోజులలో వచ్చినది కాదు. కొన్ని దశాబ్దాల కాలం వీటి మార్పుకి పట్టినది. కాలానుగుణ రచయితలు తమతమ రచనాకాలంలో ఎదాల అర్థాలు ఏ విధంగా వున్నాయో వాటిని అలా ప్రయోగించుకున్నారు. కాలక్రమేణా కొన్ని పదాల అర్థాలలో మార్పు వచ్చినది. ఇట్లాంటి మార్పును తెలుగులో అర్థ విపరిణామం అంటారు. హిందీలో 'అర్థ పరివర్తన్' అనీ, ఇంగ్లీషులో 'సిమాంటిక్ ఛేంజ్' అని అంటారు. ఈ విధంగా పదం అర్థ విపరిణామం చెందినప్పుడు పదం యొక్క అర్థం విస్తృతం అవడం గాని, సంకుచితం అవడంగాని, ఆదేశం అవడం గాని జరుగుతుంది. దీనిని తెలుగులో అర్థవ్యాకోచం, హిందీలో అర్థవిస్తార్ అని అంటారు. అర్థ వ్యాకోచంలో పదము యొక్క అర్థం విశేషమునుండి సామాన్యము అవుతుంది. పరిధి విస్తరిస్తుంది. తెలుగులో, హిందీలో తైలము, తేల్ పదాలు అటువంటివే. మొదట కేవలం నువ్వుల (తిలలు) నూనెకే వాడేవారు కాని ఇప్పుడు అన్ని రకముల నూనెలకు, తైలాలకు వాడుతున్నారు. అర్థసంకోచంతో సామాన్యార్థము నుండి విశేషార్థము తెలుపునప్పుడు పదము యొక్క అర్థం సంకుచితత్వము నొందును. 'చీర' పదము మొదట స్త్రీ, పురుషులిరువురు ధరించే వస్త్రానికి వాడేవారు. కాలక్రమేణా తెలుగులో చీర స్త్రీ ధరించే వస్త్రానికి వాడబడుతోంది. పదము యొక్క మూల అర్థము పూర్తిగా లోపించి దాని స్థానమందు క్రొత్త అర్థము వచ్చినప్పుడు ఆదేశము అందురు. దీనికి అర్థోత్కర్ష, అర్థాపకర్ష అని రెండు భేదములు గలవు. ఉత్కర్ష అనగా తక్కువ స్థితి నుండి ఎక్కువ స్థితికి

హిందీ డిపార్ట్‌మెంట్, ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు.

వచ్చుట. 'గోష్ఠి' పూర్వము ఆవులను కట్టు స్థలమునకు వాడేవారు. ఇప్పుడు 'సాహిత్యగోష్ఠి' 'పండితులగోష్ఠి' అని అనడం మనం వింటూనే వున్నాం. 'సభికులు' అన్న పదానికి పూర్వం జూదం ఆడేవారు అనే అర్థం వుండేది. కాని నేడు సభాయోగ్యమైన వారని అర్థం. అపకర్ష అనగా మొదట మంచి అర్థం నుండి కాలక్రమేణా తక్కువ స్థితికి దిగజారిన పదమునకు వాడబడుతుంది. 'ఛాందసుడు' అనగా ఛందస్సు తెలిసిన పండితుడని అర్థం. కాని నేడు దానిని చాదస్తంగా మార్చి తక్కువ అర్థంలో వాడుతున్నారు. 'స్వాహా' చేసేసేడు అన్నపదం చాలాసార్లు వింటున్నాము. అక్రమముగా తీసుకున్న డబ్బుగాని, వస్తువుగాని అని దాని అర్థం.

భారతీయ భాషలు ఎన్నో. అందులో హిందీ రాజభాష. హిందీ ఉత్తరప్రదేశ్, బిహార్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఢిల్లీ, హరియానా, హిమాచల్ ప్రదేశ్‌లలో వాడుకలో వుంది. హింది మాట్లాడేవారి సంఖ్య అందరికంటే ఎక్కువ. దాని తరువాత స్థానం తెలుగుభాష మాట్లాడేవారిది. ఆంధ్రప్రదేశ్‌లోనే కాక అన్ని రాష్ట్రాలలో విదేశాలలోనూ తెలుగువారు ఉద్యోగరీత్యా స్థిరపడివున్నారు. హిందీ కూడా దక్షిణ భారతంలోనూ విదేశాలలో కూడా వ్యాపించివుంది.

హిందీ ఆర్యభాషా కుటుంబానికి చెందిన భాష. వైదిక సంస్కృతము నుండి లౌకిక సంస్కృతము వచ్చినది. దీనిని క్లాసికల్ సంస్కృతం, దేశభాష అనికూడా అంటారు. తరువాత ప్రాకృతములనుండి, అపభ్రంశము నుండి కొన్ని భాషలు పుట్టినవి. అందులో హిందీ ఒకటి. హిందీ పదము యొక్క వ్యుత్పత్తి 'హింద్' పదానికి 'ఈక్' ప్రత్యయం చేర్చినచో హిందీ అయినది. ఈరానీ భాషలో 'స' అక్షరము 'హ'గా మారుతుంది. సంస్కృతంలో 'సప్త' అన్న పదము అవెస్తా (భాష)లో హస్త' అయినది. 'అసుర్' అన్న పదం 'అహుర్' అయినది. ఇదే ఆధారంగా 'సింధు' అన్న పదం 'హిందు' గా మారి వుండవచ్చుని భాషా శాస్త్రజ్ఞుల నమ్మకం.

'హిందీ' పదాన్ని మొదట 'భారతదేశం యొక్క ఏ వస్తువుకైనా' వాడేవారు. తరువాత మధ్యభారతంలోని భాషలన్నిటికీ వ్యవహరింపబడింది. తరువాత ప్రప్రథమంగా 'హిందీ' పదం ఉత్తర భారతదేశ భాషకి వాడబడింది. కబీరు దాసు, జాయసీ, తులసీదాసు 'హిందీ' ని భాష అనే వాడారు. హిందీని ఉత్తర భారతదేశంలో సాహిత్యంలో, పత్రికలలో, విద్యాలయాలలో, ఆఫీసులలో వ్యావహారికంగా వాడుతున్నారు.

తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన నాలుగు ముఖ్యమైన భాషలలో ఒకటి. ఆంధ్ర, తెలుగు, తెనుగు పర్యాయపదాలు. తేనె+అగు = తెనుగు. అనగా 'తేనెలా తియ్యగా వున్నది తెలుగు అని భావం. తెనుగు, తెలుగు పదాల వ్యుత్పత్తి ఒకే ధాతువు నుండి జరిగినది. ద్రావిడ భాషలలో 'న' 'ల' పరస్పర వినిమయం అవుతాయి. ణ>ల, న>లగా మారుతాయి. ఉదా : (సం.) లాంగల (తె) నాగలి అయింది. అట్లాగే లచ్చి > నచ్చి; లేదు > నేదు, జన్మము > జల్మము, మునుగు > ములుగు, లెగు > నెగు, లావు > నావు మొ॥.

తమిళ గ్రంథాలలో తెలుగుకు వడగు, వడుగ మొ॥ పదాలు వాడబడ్డాయి. పోర్చుగీసులు తెలుగువారికి జెంతియో (Gentio) అనియు, తెలుగు భాషకు జెంతూ (Gentoo) అనియు 16, 17వ శతాబ్దంలో వాడేవారు.

భాష మానవునికి ఒక వరం లాంటిది. భాష ఒక వారధి లాంటిది, ఎందువల్లనంటే భాష ద్వారానే మానవుడు మరి ఒకరితో సంబంధము పెంచుకో గల్గుతున్నాడు. భావాభి వ్యక్తికి భాషను మించిన సాధనం లేదు. భాష అందరికీ అర్థం కావలయును. లేని యెడల దాని ప్రయోజనమే లేదు. ఒక భాషలో మాట్లాడునప్పుడు శ్రోతయు, వక్తయు ఆ భాషతో పరిచితులై వుండవలెను, లేనిచో ఒక అర్థాన్ని బదులుగా మరి యొక అర్థంగా భావించు కోవచ్చు.

శబ్దార్థములు ప్రతిభాషకు ఎంతో ముఖ్యమైనవి. శబ్దము శరీరమైతే అర్థం ఆ శరీరానికి ఆత్మ. వీటి అవినాభావ సంబంధము గురించి మహాకవి కాళిదాసు రఘువంశంలో ఇలా చెప్పారు.

"వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ"

వాక్కును, అర్థమును పార్వతీ పరమేశ్వరుల వలె అవినాభావ సంబంధము కలిగి యుండును.

ప్రతి భాషకు ఎరువు పదాలుంటాయి. వాటిని 'ఆదేయ' పదములని కూడా అంటారు. హిందీలో 'ఆగత్', 'ఉధార్', 'గృహీత్' పదాలని అంటారు. ఇంగ్లీషులో 'లోన్' (loan) లేక 'బారోడ్' (barrowed) వర్డ్స్ అని అంటారు. ఏ భాష కూడా పూర్తిగా శుద్ధమైనదని గట్టిగా చెప్పలేము. ప్రతిభాషలో అన్యభాషా పదాలు వచ్చి చేరుతూ వుంటాయి. భాష మారుతూ వుంటుంది. మార్పు భాష లక్షణం. అందుకే హిందీలో 'చార్‌కోస్ మేఁ పానీ బదలే, ఆఠ్ కోస్ మేఁ బానీ' అని అంటారు. అనగా 'నాలుగు క్రోసులకు నీరు మారుతుంది, ఎనిమిది క్రోసులకు వాణి (భాష)" అని అర్థం. ఏ భాషనుంచైనా పదములు వచ్చి చేరునప్పుడు మొదట మూల భాష తాలూకు అర్థమే వుంటుంది. కాలక్రమేణ అర్థంలో మార్పు వస్తుంది. తెలుగు, హిందీ భిన్న భాషా కుటుంబాలకు చెందిన భాషలైననూ వాటిలో సంస్కృత తత్సమ శబ్దాలు చాలావున్నాయి. వాటిలో సమరూప, సమానార్థ పదాలెన్నో వున్నాయి. కాని విశేషమేమిటంటే సమరూపమైన భిన్నార్థ పదాలు అనేకం వున్నాయి. అలాంటివి కొన్ని ఇక్కడ వివరించబడుతున్నాయి:

1. అంతస్థు (<సం. అంతస్థః) సంస్కృతంలో ఈ పదానికి అర్థం రహస్యము, లోపలి భాగము, మేడపై భాగము అని. హిందీలో లోపలి భాగం, మధ్యభాగం అని అర్థం. తెలుగులో మేడపై భాగం అనే సంస్కృత అర్థంతో పాటు గౌరవం, దర్జా, పరువు, హోదా అనే అర్థాలున్నాయి.

   1. ఆ భవనం మూడు అంతస్థులది.
   2. వివాహము వారి అంతస్థుకి తగినట్లు చేశారు.
   3. వారి అంతస్థుకు నీవు ఎదగలేవు. మొదలగునవి.

2. అకాలము (<సం. అకాల) అసమయము, అశుభము, హిందీలో సంస్కృత అర్థాలతోపాటు దుర్భిక్షము, ప్రియము అనే అర్థాలున్నాయి.
   తెలుగులో అసమయము అనే అర్థం వుంది. సంజయ్ గాంధీ అకాలమరణం.

3. అక్రమము : (<సం. అక్రమః) ఆధిక్యము, ప్రముఖత, ఉత్కృష్టత, శ్రేష్ఠత మొ. అర్థాలున్నాయి. హిందీలో అతిశయ్ అంటే హెచ్చు, అధికము, ఒక అలంకారము.
   తెలుగులో ఈ పదానికి ఆశ్చర్యం, అద్భుతం, గొప్ప, గర్వం అనే అర్థాలున్నాయి. ఏదైనా ఎక్కువ అయితే గర్వం ఎక్కువ అవడం సహజం. తెలుగులో గర్వానికే ఈ పదం ఎక్కువగా వాడుతారు.

5. అదృష్టము (<సం. అదృష్టమ్) కనిపించనిది, భాగ్యం, ప్రారబ్దం మొ. అర్థాలు సం.లో వున్నాయి. హిందీలో అదృష్ట అంటే చూడబడనిది, కనిపించ నిది, అదృశ్యం అంతర్థానం మొ. అర్థాలున్నాయి. తెలుగులో పై అర్థాలతోపాటు భాగ్యం, మేలు అని దీనికి పరిణమించిన అర్థాలు. '
   మొ.
   ఈ అర్థాలనే సూచిస్తాయి. దీనికి భిన్నమైన పదం దురదృష్టం. ఇంగ్లీషులో luck అనేది అదృష్టానికి పర్యాయ పదం.

6. అనుమానం (<సం. అనుమానమ్) ఊహించి చెప్పుట, ఊహ, సాదృశ్యము, ఒక అలంకారము. హిందీలో అనుమాన్‌కి ఊహించుట, ఉజ్జాయింపు అనే అర్థాలున్నాయి.

తెలుగులో అనుమానం అంటే సందేహం, సంశయం అనే అర్థాలలోనే ఎక్కువ వ్యాప్తి.
'ఈ పని చేసింది వాడని నా అనుమానం'
'వాడి మీద అనుమానంగా వుంది'

7. అభ్యంతరం (<సం. అభ్యంతర) సం.లో లోపలి భాగం, ఆంతరికం అనే అర్థాలున్నాయి.
హిందీలో మధ్యది, హృదయము అనే అర్థాలు ఉన్నాయి.
తెలుగులో పూర్తిగా భిన్నార్థంగా వ్యవహరించ బడుతుంది. అభ్యంతరం అనగా ఆటంకం, అడ్డు అనే అర్థాలలోనే రూఢి అయినది.

8. అపరాథం (<సం. అపరాధః) నేరం, తప్పు అనే అర్థాలు సం.లో వున్నాయి. హిందీలో కూడా అవే అర్థాలున్నాయి. తెలుగులో తప్పు, నేరము కాక జరిమానా, జుల్మానా అనే అర్థాలున్నాయి.
అతడు వంద రూపాయలు అపరాథం చెల్లించాడు.

9. అవసరం (<సం. అవసరః) మంచి అదను, చోటు, స్థానము, అనే అర్థాలు సం.లో వున్నాయి.హిందీలో అవసర్ అంటే తీరిక అవకాశం, సమయం, chance అనే అర్థాలున్నాయి.
తెలుగులో అక్కర, తొందర, అవశ్యం అనే అర్థాలున్నాయి. 'పది రూపాయలు అవసరం వచ్చింది, ఇయ్యి' అనే మాట చాలాసార్లు వింటూంటాం.

10. అసహ్యం (< సం. అసహ్య) సహించలేనిది అనే అర్థం సం.లో వుంది. హిందీలో కూడా అదే అర్థంలో ఈ పదం వాడబడుతోంది. తెలుగులో అసహ్యం అంటే రోత, అయిష్టత, చెడ్డ, నీచం అనే అర్థాల్లోనే వ్యాప్తి.

11. ఆగ్రహం (< సం. ఆగ్రహః) సం.లో ఈ పదానికి పట్టుకొనుట, స్వీకరించుట, ఆక్రమణము, ధృఢ సంకల్పము మొ. అర్థాలున్నాయి. హిందీలో వేడుకొనుట, నివేదించుట, మొండితనము మొ. అర్థాలున్నాయి.
తెలుగులో క్రోధము, కోపము, రోషము మొ. అర్థాలున్నాయి.

12. ఆలస్యము (< సం. ఆలస్య) సం.లో శిథిలము, సోమరితనం, నీరసం, చలాకీతనం లేకపోవుట మొ. అర్థాలున్నాయి. హిందీలో కూడా ఆలస్య, ఆలసీ అంటే పనిచేయుటలో ఉత్సాహం లేక పోవుట, సోమరితనం మొ. అర్థాలున్నాయి.
తెలుగులో ఇంగ్లీషు lateకి పర్యాయపదం ఆలస్యం.
'ఇంత ఆలస్యంగా వచ్చావేమిటి?', 'ఆలస్యం అమృతం విషయం' అనే సామెతలలో (late) జాగు అనే అర్థం వస్తుంది.

13. ఉచితం : (< సం. ఉచిత) సం.లో తగినది, యోగ్యమైనది, యుక్తమైనది, పరిచితమైనది, మితమైనది అనే అర్థాలున్నాయి. హిందీలో ఉచిత్ అంటే యోగ్యమైన, సరియైన అర్థం. తెలుగులో పైన ఉదహరించిన అర్థాలతోపాటు free గా డబ్బు చెల్లించనవలసరం లేకుండా, దొరికేది అని అర్థం.
'ఒక రిఫ్రిజిరేటర్ కొంటే ఒక గడియారం ఉచితం' ఇలాంటి ప్రకటనలు మనం నిత్యం చూస్తూనే వుంటాము.

14. ఉద్యోగం (< సం. ఉద్యోగః) సం.లో ప్రయత్నం, ధైర్యం, పని, శ్రమించుట మొ. అర్థాలున్నాయి. హిందీలో ఉద్యోగ్ అంటే ప్రయత్నం, ప్రయాస, industry మొ. అర్థాలున్నాయి. ఎక్కువగా 'ఉద్యోగధందే' అని industries కే వాడబడు తోంది. తెలుగులో ఉద్యోగం అంటే మన అందరికీ తెలుసు. ప్రయత్నం, ప్రయాస లేనిదే దొరకనిది ఉద్యోగం.

"ఉద్యోగం సద్యోగం లేక వూరిమీద పడి తిరుగుతున్నాడు". ఇక్కడ సద్యోగం అనే పదానికి ఏ అర్థం లేదు. కేవలం ముందు పదాన్ని బలపరచడానికి వాడిన పునరుక్తి పదం.

15. ఉత్తరం (< సం. ఉత్తర) సం.లో ఉత్తరదిశ, పైది, మీదది, సమాధానం మొ. అర్థాలున్నాయి. హిందీలో కూడా సంస్కృత అర్థాలే ఈ పదానికి వున్నాయి.

'తెలుగులోఉత్తర దిశతో పాటు జాబుకి కూడా వాడబడుతోంది. 'మీ అబ్బాయి వద్ద నుండి ఉత్తరాలు వస్తున్నాయా?'ఇలాంటి ప్రశ్నలు మనం తరచూ వింటూ వుంటాము.

16. ఉపన్యాసం (< ఉపన్యాసః) సం.లో ప్రక్కన వుంచుట, దగ్గర వుంచుట, భూమిక, ప్రస్తావన మొ. అర్థాలున్నాయి. హిందీలో 'ఉపన్యాస్' అంటే 'నవల' అని అర్థం. తెలుగులో ఉపన్యాసం అంటే లెక్చర్ (lecture) ఇవ్వడం అని అర్థం.

ఈ రోజు టి.వి.లో ప్రధానమంత్రి ఉపన్యసించారు.

17. ఉపాధి (< సం. ఉపాధి)ఉపనామము, బిరుదు, ప్రయోజనం మొ. అర్థాలు సం.లో వున్నాయి. హిందీలో కూడా అవే అర్థాలున్నాయి. అదికాక 'ఉపాధి' అంటే 'డిగ్రీ' (B.A., M.A., Degree) అర్థం కూడా వుంది.

తెలుగులో ఉపాధి అంటే జీవనోపాధి అని అర్థం. 'ఉపాధి కల్పించారు'అని 'ఏదో ఒక ఉపాధి వుండాలి కదా' అని అంటూండడం మనం వింటూనే వుంటాము.

18. కల్యాణం (<సం. కల్యాణ) అక్షయము, శుభము, ఉత్సవము అనే అర్థాలు సం.లో వున్నాయి. హిందీలో 'కల్యాణ్' అంటే శుభప్రదం, శుభమని అర్థం.

తెలుగులో 'కల్యాణం' అంటే వివాహం, అని అర్థం. కల్యాణవేదిక, కల్యాణ ఘడియ, కల్యాణపు బొట్టు, రుక్మిణీ కళ్యాణం. సీతాకళ్యాణం మొ. వాటిల్లో వివాహం అనే అర్థమే వస్తుంది.

19. గ్రహచారం (సం. గ్రహచారః)గ్రహముల యొక్క గతి, గమనము అని అర్థం.హిందీలో కూడా ఈ అర్థాలే వున్నాయి.

తెలుగులో ప్రారబ్ధం అని, దురదృష్టం అని అర్థాలున్నాయి.

20. ప్రియమ్ (< సం. ప్రియమ్) ప్రేమ, కృప, సేవ, అనుగ్రహం, ఆనందం, సుఖ సమాచారం మొ.

హిందీలో ప్రియమైనవారు, సుందరమైన, మనోహరమైన, పతి, స్వామి, అల్లుడు, మేలు మొ. న అర్థాలున్నాయి.

తెలుగులో సం. అర్థాలతోపాటు ఇష్టము, హెచ్చు వెలగల అనే అర్థాలున్నాయి. ఇంగ్లీషులో costly, expensive అనే పదాలు ఈ పదానికి పర్యాయ పదాలు. ఈ అర్థం కేవలం తెలుగులోనే వుంది.

21. వ్యవసాయం (< సం. వ్యవసాయః) ప్రయత్నం, నౌకరీ, వాణిజ్యం, ఆచరణ. మొ. అర్థాలు సంస్కృతంలో వున్నాయి. హిందీలో జీవనోపాధికి చేసేపని. వృత్తి, రోజు కూలి, ఉద్దేశ్యము, అభిప్రాయము మొ. అర్థాలున్నాయి. తెలుగులో వ్యవసాయము అనగా 'సేద్యము'

ఇలా పరిశీలన చేస్తూ వుంటే మనకి ఎంతో వింతగా వుంటుంది. ఎన్నో పదాలు మన భాషలో కలిసి పోయాయి. కొన్నిటిని ఉదాహరణకు ఇక్కడ ఇవ్వడం జరిగింది. రెండు భాషలతో పరిచయమున్న వారికి ఇబ్బంది వుండదు గాని ఒక భాష బాగా వచ్చి రెండోది కొంచెం తెలిసినవారికే అసలు ఇబ్బంది అంతా. ఇక పదాన్ని ఒక అర్థానికి బదులు మరొక అర్థంలో అర్థం చేసుకుంటేనే తంటా అంతా. భాషకి అర్థం ప్రాణం. అర్థాన్ని అపార్థం చేసుకోకుండా వుంటేనే ఆనందం'. ★★

# సాదృశ్య విచారము

నఖచిత్రకళా వాచస్పతి డా॥ డి.కె. శ్రీనివాసాచార్యులు

కేవలం అభిప్రాయ బోధకాలైన చిత్ర చేష్టాదులకు. కేవలం వర్ణాత్మకాలైన క.చ.ట.త.ప, వర్గాలకు "భాష" అను వ్యవహారం లేదు. "బాష" అంటే "భాష్యతే, శాస్త్రవ్యవహారాదినా ప్రయుజ్యతే ఇతి భాషా" "బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ" "భాష్యతే ఇతి భాషా' 'భాష వ్యక్తాయాంవాచి. భాషింప బడునది భాష. ఇత్యమరః. మాట. ప్రతిజ్ఞ, ప్రమాణము (Speech; Idias, Expressed in Words) భాషా నిర్వచనం స్మృతులలో కూడా "అష్టాదశ భాషా వార విలాసినీ భుజంగః. వ్యవహారే ప్రతిజ్ఞా సూచక వాక్యే" యదా వేదతే రాజ్ఞీ తద్భాషేత్య బిధీయతే" అని పేర్కొనడం జరిగింది.

అభిప్రాయ బోధకమగు వర్ణాత్మకధ్వని, భాషా విపరిమాణ స్వభావం కలిగి జాతి భేదం వల్ల తత్తద్దేశీయ శీతోష్ణ భేదాలవల్ల, సుఖోచ్చారణాభిలాష వల్ల 'భాష" విపరిణామాన్ని పొం.. ..ది. ఆ విపరిణామంలో కొన్ని ధ్వని నియమాలు కూడ కనిపిస్తున్నాయి.

పదానికి నిర్వచనం పాణిని "సుప్తి ఙంతం పదం అను సూత్రము చేత పేర్కొన్నాడు. సుబంతం - తిఙంతం కూడా పదాలే. అర్థాన్ని బట్టి కొన్ని పదాల సామ్యం కనపడుతుంది. రూపాన్నిబట్టి కూడా కొన్ని పదాల సామ్యం కనబడుతుంది. బంధువర్గాన్ని తెలియజేయు మాతృ-పితృ-భ్రాతృ శబ్దాలు బంధువాచకత్వంతో పాటు రూపసామ్యాన్ని పొందాలి. ఆంగ్ల భాషలో Brother శబ్ద సాదృశ్యంవల్ల Father, Mother అను పదాలలో T.H. వర్ణాలు కనబడుతున్నాయి.

సంహితాభాగం - బ్రాహ్మణభాగం - ఆరణ్యకోప నిషద్భాగాలు; లౌకిక సంస్కృతం వీటినన్నిటిని పరిశీలిస్తే సంస్కృతంలో విపరిణామం కనబడుతుంది. ప్రాకృత బాషలు కూడా కారణాలే. సంస్కృత భాషా విపరిణామ పరిశీలనలో అవస్త, గ్రీక్, లాటిన్ భాషలు కూడా విపరిణామ హేతువులే.

అశ్వా - రమా - ఇత్యాది రూప సాజాత్యంవల్ల 'స్నుషా' అనే పదంలోకూడా స్త్రీత్వ ద్యోతక ఆకార సంయోజనంవుంది. ఇందు పాణిని ప్రామాణిక సూత్రము కూడ వుపకరిస్తుంది. "అజాద్యతష్టాప్" అజాదీనాం అకారాంతస్యచ వాచ్యం యత్ స్త్రీత్వం తత్రద్యోత్యే టాప్స్యాత్". అజాద్యుక్తిః జీషో, జీపశ్చవధనార్థా. అజా - ఏడకా - అశ్వా - చటకా - మూషికా. బుధ్ ధాతువునకు బోధయతి అను రూపదర్శనం వల్ల "తులయతి" 'తోలయతి' అను రూపాలు ప్రచారంలో వున్నాయి.

"బ్లూం ఫీల్డ్" అను శాబ్దికుడు అర్థ సాజాత్యంతో సదృశ పద నిష్పాదనాన్ని (Analogy) అంగీకరించాడు. సదృశపద నిష్పాదనంలో ధ్వని సాజాత్య మొక్కటే కారణం కాదు. అర్థ సాజాత్యం కూడా కారణమే. ఇకారాంత "పతి' 'శబ్దము యొక్క షష్ఠైక వచనములో "పతేః" కాగా 'పితృ - భ్రాతృ - మాతృ - ఆది ఋకారాంత శబ్దతుల్యంగా "పత్యుః" అని రూపము చెప్పబడుతుంది. పాణిని "శేషోధ్యసఖి". అనదీ సౌజ్ఞా హ్రస్వాయావిదుతే తదంతం సఖి వర్జం హి సంజః స్యాత్ అని సూత్రీకరించాడు. సిద్ధ ప్రక్రియను మనసున భావిస్తూ దానికనుగుణంగా ప్రక్రియాంతర కల్పనమే సాజాత్యమని తెలుసుకోవాలి. ఈ సాజాత్యాన్ని అనుసరించియే పదనిష్పత్తిలో, శబ్దాంతములలో, విభక్తులలో, ధాతులకారాలలోను అనేక పరిణామాలు జరుగు తున్నాయి. ఈ విశేషాలను గ్రహించి

కొందరు శాబ్దికులు "మార్ఫాలజీ" Mortology విభాగానికి "యణాలజీ" ...logy మూలభూతంగా నిలచిందని చెబుతున్నారు. సాదృశ్య పరిశీలనలో మూడు విభాగాలు కనుపిస్తున్నాయి.

1) Formal analogy 2) Logical analogy. Proportional analogy

1) Formal analogy :-

ఒకానొక పదములోని 'అంశ' సాజాత్యంతో విజాతీయ పదాంతరములలో 'అంశ' తాదృక్షత ఏర్పడుతుంది. 'ఋ' కారాంత మాత్రాది శబ్ద సా...శ్యంవల్ల విజాతీయ 'ఇకారాంత' పతి శబ్దము యొక్క పంచమి, షష్ఠి విభక్తులలో పత్యుఃరూప మేర్పడింది. ఈ విషయాలను తెలియజేసే సూచిక :-

| ఇండోజర్మనిక్ | సం | లా | గ్రాథిక్ | ఇంగ్లీష్ |
|---|---|---|---|---|
| 1) భ్రాతర్ | భ్రాతా | ఫ్రాటర్ | - | బ్రదర్ |
| 2) పితర్ | పితా | పాటర్ | ఫాదర్ | ఫాదర్ |
| 3) మాతర్ | మాతా | మాటర్ | మౌటర్ | మదర్ |

2) Logical analogy :-

ఒకానొక పదానికి వేరొకచోట స్థితిని పరిశీలించి ఆ పదానికి స్థలాంతరంలో తాదృక్షత.

'భవామి' 'బోధామి' అను క్రియా రూపాలనను సరించియే. 'భవావః - భవామః' బోధావః బోధామః. అను రూపాలలో దీర్ఘ కల్పనం Logical analogy ద్వారా సంభవిస్తుంది.

3) Proportional analogy:-

శబ్ద ప్రక్రియాలాఘవ పక్షపాత న్యాయంతో అను రూప్య సంపాదనకై సిద్ధప్రక్రియా సాదృశ్యంతో రూప కల్పన చేయుట "Proportional analogy" గా భావించవచ్చు.

జర్మన్ భాషలో 'అస్మచ్ఛబ్దతుల్యం' ద్వితీయలో 'Mich', చతుర్థిలో 'Mir', యుష్మచ్ఛబ్దతుల్యం ద్వితీయలో 'dich', చతుర్థిలో 'Dir' అనివుంది. 'Sich' అనుదానికి చతుర్థిలో రూపాంతరం లేదు. ఈ కారణంవల్ల జర్మన్ కావ్యాలలో చతుర్థిలో కూడా 'ich' అనియే ప్రయోగము వున్నది. సంస్కృతములో "రామ" శబ్ద సాదృశ్యంవల్ల "ధార" శబ్దానికి కూడా ఏకవచన - ద్వివచనాలలో "దారః - దారౌ" అని కవియెప్పుడైనా భావిస్తే అది proportioal analogy ద్వారానే సంభవించాలి. 'దారయంతి' - 'ఉద్వేజయంతి' పతీనితి దారాః భ్రూభయే పతులను భయపెట్టువారు. ఈ శబ్దం అకారాంత పుంలింగ నిత్య బహువచనము.

"లుఙ్" విచారములో కూడా proportioal సాజాత్యోల్లాసం వుంది. "టఙ్" పరిశీలనలో మొదట "లుఙ్" రెండు విధాలు. 1) Root Aorist 2) Sigmatic Aorist

1) Root Aorist :-

ఇది రెండు విధాలు. 1) Aaorist 2) Aorist without 'a'

"Root Aorist" సిజాది రహితమైన "లుఙ్" ప్రత్యయము. అది రెండు విధాలు. 1) అకారసహితము 'A'aorist 2) అకార రహితము Aorist without "A" అకారమంటే "చఙ్. చఙ్ రహితములో "అడాగమం" ఉ: అగాత్, అస్థాతత్, అభూత్, అదిత, అధిత మొ॥నవి. 'పుషాదిత్యుది తాద్ల్యుదితః పరస్మైపదేషు.

ఈ విధంగా పరిశీలింపబడుతున్న పదసాదృశ్యం భాషా శాస్త్రంద్వారా వివరింపబడింది. ఏ భాషా శాస్త్రమైనా సరే "వక్తృనిష్ఠవచన లాఘవాన్ని శ్రోతృ నిష్ఠ శ్రవణ లాఘవాన్ని" అనుసరించియే సుబంత, తిఙంత, పదాల సాదృశ్య విచారంలో సహకరిస్తుందనుటలో సందేహం లేదు.

★★

# ఎగిరేపక్షి

- ధూర్జటి వేంకటబాలాజి

మబ్బులు మాటాడవు కానీ వర్షిస్తాయి.
జ్ఞానేంద్రియాలు కనిపించవు కానీ ఆలోచిస్తాయి.
ఉబికిన కళ్ళనుండి వేడి ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు
కార్యకారణాలు తెలియకపోవచ్చు మనసుకు తెలుసు.
కళ్ళతో భాషించగలగడం -
నోటితో చూడగలగడం -
కంఠంతో వినగలగడం -
సాధ్యమయ్యే పనేనా ?! -
అసాధ్యమయ్యేది -
సాధ్యమౌతుందని చెప్పగలగడం -
ఒకవింత అనుభూతి -
కళ్ళల్లో క్రూరత్వం - మనసులో మాలిన్యం -
చేతలలో కాఠిన్యం -
అంతాకలబోసి ఒకటిగా మారినప్పుడు
మంచిమనిషి కూడా -
మరమనిషిగా - మారతాడన్నది -
నూటికి నూరుపాళ్ళు సత్యం.

☆ ☆ ☆

పక్షి ఎగరడం సహజం
పిల్లి దూకడం మరీ సహజం.
ప్రాకే ప్రాణులూ-ఈదే జలచరాలు -
వాయువేగమనోవేగాలతో -
మనసుకన్నా వేగంతో -
ముందుకు వెళ్ళగలగడం -
మునుముందుకు -దూసుకునిపోవడం -
ప్రకృతిధర్మం.
పక్షిఎగరడం సహజమైతే
మనిషి ఎగరడం అసహజం.
గాలికన్నా -నీటికన్నా -భూమికన్నా -అగ్నికన్నా -
అమృతంకన్నా -మనిషి మనసే మిన్న.

☆ ☆ ☆

నీదినాదనే భేదం లేనప్పుడు
మనుషులను మానవాతీతులుగా చూచినప్పుడు -
ఒక్కసారి - మనసే -
వాయువేగమనోవేగాలతో -
అనంత చైతన్యంలోకి ఎగిరిపోయి-
అందరినీ అలరిస్తుంది.
క్షణికావేశంలో లోనయ్యే మనుషులకు -
సంపూర్ణ చైతన్యాన్ని ప్రసాదిస్తుంది.
అప్పుడు -
మనసుకన్న బలం మరి దేనికీ లేదు.
ఆ సమయంలో మనసు -
ఒక ఎగిరే పక్షి.
మామూలు పక్షిలాగా -
రెక్కలు విచ్చుకొని ఎగరకుండా -
వినీలాకాశంలో - విస్ఫూర్త దీప్తితో
విజ్ఞానతేజంతో - ముందుకు దూసుకుపోయే
ఒక హరిణకంలాగా అరణ్యంలో -
ఒక పక్షిలాగా ఆకాశంలో నిలచిపోతుంది.
తనగమనాన్ని ఇతరులకు తెలియజేస్తుంది.
అందులకే - అది ఒక ఎగిరే పక్షి
అని మనం పిలువకుండా ఉండగలమా ?!

తెలుగు లెక్చరర్, డో. నెం. 10-38-8బి, టీచర్ల కాలనీ,కావలి

# పుణ్యభూమిని స్నానం చేయిద్దాం రండి !

- కె.యస్వీ. ప్రసాద్

అన్నం కరువై అసువులు బాసే భూమిలో
ఆత్మ రక్షణకోసం ఆటంబాంబులెందుకు ?
వేలిముద్రల్ని వ్యవసాయం చేసే పెద్దమనుషులు
చెమటను ప్రేమించడం చేతగాక
"శ్రమదానం పత్రిక"లో ముఖచిత్రంగా ప్రత్యక్షమవుతారు
పంటల్ని ప్రసవించే రైతులు
గుక్కెడు గంజిలేక గుటకలు వేస్తూంటే
సబ్సిడీ పథకాలతో స్వప్న ప్రపంచాల్ని సృష్టిస్తారు
తెరమీద గ్లామరు
బూతును పండిస్తూంటే
రాయితీలివ్వడమే గొప్ప కళాపోషణయింది
కుంభకోణాలలో కూరుకుపోయి
దేశం దివాలా తీస్తుంటే
మూడు సింహాల సింహాసనమెక్కిన నాల్గవ సింహం
స్వార్థాన్ని మేసి ఆవులిస్తుంది
పాళీలోంచి ప్రవహించే ప్రణాళికలన్నీ
పరీక్ష నాళికల్లో ప్రయోగాలై
విశ్వవేదికపై దిగంబర నాట్యం చేస్తున్నాయి
మానం దాచుకోవడానికి
చిరిగిన రవికే దిక్కైన దేశంలో
విశ్వసుందరి పురస్కారాలు
వీరంగాలు వేస్తున్నాయి
కురవని వానకోసం
అన్నదాతలు ఎండమావులకై ఎదురుచూస్తుంటే
"యూరియా" తిన్న మొక్కలన్నీ
వటవృక్షాలవుతున్నాయి.
ఇపుడు -
కనడానికి కలలేవి మిగలనివేళ
తినడానికి గుప్పెడు మెతుకులు దొరకనిచోట
అక్షరాలై పల్లవిస్తున్న అభాగ్యులారా !
ఈ పుణ్యభూమిని జీవనదుల్లో
స్నానం చేయిద్దాం రండి !
కాశ్యపి ఖండానికి శుభ్రవస్త్రం
కడదాం కదలండి !!

అమృతవర్షిణి (సాంస్కృతిక సమితి), ఉప్పుగుండూరు

# అతడు - ఆమె

నిర్జన శిధిలాల మధ్య వ్యర్థంగా పూసిన మాదుగ్గపూల
పెదవుల స్మృతి గీతాలై సమసిపోయిన రాత్రి
తత్పత్ర తరుచ్ఛాయలలో
నిబిడీకృతమైన అంధకార పారావారాలు
విషాదోదధులై కంట వుప్పొంగిన రాత్రి,
పూల సంద్రాల గుండెల్లో
శతకోటి నిట్టూర్పులు నింపి
జ్యోతిరింగాల విజయపతాకలు చేతబట్టి
దిగంతాలు దాటిపోయే చంద్రుని కోసం
ఉత్తుంగ శిఖరాగ్రాలకు దూకు
ఉదగ్ర జల ప్రపాతపు గుండెల హోరు
ఎదలో యిమిడిపోయిన రాత్రి -
జ్ఞాపకాల పాథేయం, విషమయమైన ఆ క్షణంలో
జీవన గతులు తారుమారైన ఆ క్షణంలో -
మృత్యువే ముందు నిలిచి
ఆమె వెన్ను తట్టి వెళ్ళింది !
వెయ్యి రాత్రుల పెట్టైన ఆ ఒక్కొక్క రాత్రి
గుండెల్లో నింపిన నిస్పృహే
అతడిపట్ల నిర్లిప్తతగా మారేక
ఇక ముందుకు సాగడమేగాని
వెనక్కు మళ్ళడమంటూ లేదుగా

ద.భా.హి. ప్రచార సభ, త్యాగరాయ నగరం, మద్రాసు - 17

# హైకూలు

- సి. కామేశ్వర్

ఇప్ప పువ్వు
విషపు నవ్వు
ఎదలో ఆరని సెగలు

☆ ☆ ☆

మనసు చలనం
దాహం తీరని
కోర్కెల వలయం

☆ ☆ ☆

చిగురుకు పిలుపు
పచ్చని ప్రకృతికి
మేలు కొలుపు

☆ ☆ ☆

కాసారంలో
కలకలారావం
కొంగ దొంగ జపం

☆ ☆ ☆

గాలి ఈల
పూల పరిమళాహేల
పడుచుగుండెలో జ్వాల

మేఘబాల
ఎదలో గిలిగింత
అవని గుండె పులకింత

☆ ☆ ☆

జనన మరణ
ధ్రువాల మధ్య
జీవితం మిథ్య

☆ ☆

కంటి రెప్పపై
కన్నీటి కలవరింత
కడుపులో ఆకలి కరకర

☆ ☆ ☆

కోకిల పాట
కోనంతా వెలుగు
కవి కలంలో కవిత

☆ ☆ ☆

బారులో మత్తు
కాళ్ళు గమ్మత్తు
రోడ్డుపై మనిషి చిత్తు

తిలక్ నగర్, కాశిబుగ్గ 532 222

# అమ్మఒడి

- ఏనుగు నరసింహారెడ్డి

స్వర్గలోక నందనాలన్నీ కుసుమాల్ని నాకై కురిపించినట్లు
ఏటి ఇసుకలో కట్టుకున్న పిట్టగూళ్ళన్నీ కలిసి ఊరై
రూపెత్తినట్లు
గంగిరెద్దు బొంత గంటల చుట్టు పరుగెత్తనవసరం
లేకుండానే
నీ మృణ్మయకరాలు నా చెక్కిళ్ళను
ఘల్లుమనిపించినట్లు
మైసమ్మ తిరణాలలో అమ్మే పిల్లనగ్రోవి నీ గొంతై
సాయంకాలపు నీరెండలో పాడినట్లు
గుడిసె గడపలో కూర్చొని తరచూ కార్చే అశృధార
ఆక్షణం తెల్లముత్యమై మెరసినట్లు
కంపచెట్టుకు కట్టిన గోనెసంచి ఊయల
ముతక చీటిచీరయై ఊగినట్లు
నువ్వు గోడకేసి కొట్టిన పిడకల్ని లాగేస్తుంటే
నన్నుచూసి ఆనందంగా హసించినందుకే
నీ మెడలో నల్లపూసల దండను లాగి ఆడుకున్నట్లు
ఎన్ని అనుభవాలను కొనితెచ్చుకున్నాను నీ ఒడిలో
ఎన్ని వసంతసోయగాల్ని ప్రోదిచేసుకున్నాను.
నీ ఒడి
వందలవేల స్మృతి పుస్తకాలను
సునాయాసంగా చదివించే బడి

మమత గీతాలను మధురంగా గానంచేసే శారదా
విపంచి
పెద్దేరు సాగరమై
ఊరిమీద పవళించిన రోజున
నిన్ను పల్లకీ చేసి అధిష్టించిన నేను
శిశిర రక్కసిపై
నీ ఒంటి జంబుఖానాతో యుద్ధం ప్రకటించిన నేను
వైశాఖ మిట్ట మధ్యాహ్నానికి
నిన్ను గొడుగ్గా మార్చుకున్న నేను
నీ మనో వినీలాకాశంపై చందమామలా నేను
గాయంగేయమైతే పాడుకుంటున్నానే గానీ
పల్లవి గురించి పట్టించుకోవడం మానేశాను
కేవలం గుర్తు తెచ్చుకుంటున్నాను
నువ్వు నాకోసం
ఇల్లు ఇల్లంతా శతృవువైన రోజును
నా పాలకోసమే నువ్వు
బువ్వతిని అరిగించుకున్నరోజును
నాకోసం విస్తరిపర్చి
నువ్వు నీటి తాగుబోతువైన రోజును
కడలి కష్టాన్ని కళ్ళలో నింపుకొని
నాకోసం నయాగరావై నవ్విన రోజును

102, సిద్ధార్థ అపార్ట్‌మెంట్స్, టి.వి. స్టూడియో ఎదురుగా, రామాంతపూర్, హైద్రాబాద్ - 13

- ఆచార్య ఫణీంద్ర

నీ సరిదైవమేదియని నీ స్మరణాంబుధిలోన మున్గి, నే
చేసెద నీకు సేవ, మరి చేయుచు కావ్య రసాల సృష్టినిన్ -
ఏ సమయంబునైన మది నీవిధి దీక్షను బూనియుందు - ఓ
వాసర రాణి ! వాణి ! ఇదె వందన చందన మందుకోగదే !
చేసిన తప్పులన్ని పెదచిత్తముతోడ క్షమించుమమ్మ ! నా
దోసము లెంచకుండ, సరిదోవను సాగెడునట్లు నన్ను, నీ
దాసుని 'కన్న బిడ్డనొక తల్లియు చూసిన' రీతి ప్రేమతో
చూసిన చాలునమ్మ ! ఘన శోభిత పాండితి దక్కకుండునే ?
మూసిన కన్నులన్ తెరచి, ముందుగ ప్రొద్దున నిన్ను మ్రొక్కి, నే
చేసెడి విన్నపమ్మొకటి - చెప్పెదనమ్మ మరొక్కమారు - నా
దోసిలి తోడ నీదు పదతోయజయుగ్మము పట్టి, భక్తితో -
చేసిన చాలునమ్మ ! నను శ్రీయుతుడౌ ఘన కావ్య కర్తగన్-
వ్రాసెడు వాడు నీకు పతి - వ్రాయును జీవుల ఫాల రేఖలన్ -
ఈసరి వ్రాయువేళ, మరి ఈశుని ప్రక్కన నుండి కొద్దిగా
వ్రాసెడునట్లు చూడు - నను వచ్చెడి జన్మల యందు సైతమున్
భాసురమౌ కవీశ్వరుని బంగరు జీవన మందునట్లుగాన్ -
వ్రాసిన అన్ని కావ్యములు వాసిగ రూపును దిద్దుకొంచు, నే
భాసురమైన ఖ్యాతికిని పాత్రుడనై వెలిగొందునట్లుగాన్
నీ సుకుమార హస్తమును నీ సుతుడీ కవి మస్తకమ్ముపై
దూసి వరంబు నీయవమ ! దొడ్డ మనస్సును బూని, భారతీ !

20, అశ్వినీ నగర్ కాలనీ, వెస్ట్ మారెడుపల్లి, సికింద్రాబాదు - 500 026.

# కులపరమైన జానపద విజ్ఞాన అధ్యయనం ఆవశ్యకత

ఈనాడు జానపద విజ్ఞానం మీద చెప్పుకోతగిన స్థాయిలో పరిశోధన జరుగుతూ ఉంది. అయితే ఈ పరిశోధన ఎక్కువగా జానపద సాహిత్యం మీదనే జరిగింది. జానపద సాహిత్యంలో భాగాలైన గేయాల మీద, కథాగేయాల మీద జిల్లాల వారీగా, మండలాల వారీగా పరిశోధన చేస్తున్నారు. అంతే గాకుండా జానపద గేయంలో అంతశ్శాఖలైన శ్రామిక గేయాలు, స్త్రీల గేయాలు, పిల్లల గేయాలు, శృంగార గేయాలు, హాస్య గేయాలు మొదలైన వాటి మీద చెప్పుకో తగినంతగా పరిశోధన జరిగింది. జానపద వచనంలో భాగాలైన సామెతలు,పొడుపు కథలు, కథల మీద గూడా పరిశోధన జరిగింది. జరుగుతూ ఉంది. దృశ్యశాఖ. అయిన జానపద కళల మీదగూడా పరిశోధన చేశారు. చేస్తున్నారు. జిల్లాల వారీగా గ్రామదేవతల మీదగూడా పరిశోధన జరుగుతూ ఉంది. కాని కులపరమైన జానపద విజ్ఞానం మీద మాత్రం జరుగలేదు.

కులపరమైన పరిశోధన అనగానే కొంతమంది కులపరమైన పరిశోధన ఏమిటని పెదవి విరవడం, చెవులు కొరుక్కోవడం చేస్తారు. కులపరమైన పరిశోధన నేరమూ కాదు, కులపిచ్చిని కల్పించడమూ, ప్రోత్సహించడమూ గాదు. కులవ్యవస్థ అనేది మనదేశంలో కొన్నివేల సంవత్సరాలుగా ఉంది. వేల సంవత్సరాలుగా ఉండడం వల్ల చాల కులాల్లో తమవే అని చెప్పుకోతగిన కొన్ని వృత్తులు, సంప్రదాయాలు, ఆచారాలు, అలవాట్లు, నమ్మకాలు ఏర్పడ్డాయి. వీటన్నింటిని పరిశీలించి వెలికి తీయడానికి తప్పనిసరిగా కులాల వారీగా పరిశోధన చేయవలసిందేగాని మరొక రకంగా సాధ్యం కాదు. ఇదే రకమైన అభిప్రాయాన్ని అలెన్ డండెస్ అనే జానపద విజ్ఞాన వేత్త జానపదులంటె ఎవరు అనే ప్రశ్నకు సమాధానంగా The study of Folk lore అనే గ్రంథంలో ఇలా చెప్పాడు. "The term 'Folk' can refer to any group of people what so ever who share at least one common factor. It does not matter what the linking factor is - it could be a common occupation,language,or religion, but what is important is that a group formed for what ever reason will have some traditions which it calls its own" ఏదైనా ఒక్క విషయంలోనైనా భాగం పంచుకుంటున్న ప్రజల గుంపును జానపదులు అనవచ్చు. వీరందరిని కలుపుతున్న ఆ విషయం వృత్తి కావచ్చు, భాష కావచ్చు,లేక మతం కావచ్చు.అయితే ముఖ్యమైనదేమంటే ఏ కారణం చేత ప్రజలు గుంపుగా కలిసి ఉంటున్నారో వారందరూ తమవే అని చెప్పుకో తగిన కొన్ని సంప్రదాయాలను కలిగి ఉండాలి" అనేది పై నిర్వచనం యొక్క భావం. ఈ నిర్వచనం ప్రకారం కులవృత్తిని చేసుకుంటూ తమవే అని చెప్పుకో తగిన ఆచారాలు సంప్రదాయాలు కలిగిన ఒక్కొక్క కులానికి చెందిన ప్రజలను ఒక Folk గా గుర్తించి వారియొక్క జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేయవచ్చు.

మన రాష్ట్రంలో చాల కులాలు ఉన్నాయి. వీటిలో కొన్ని కులాలకు మాత్రమే ప్రత్యేకమైన కుల వృత్తులు న్నాయి. ఆ కుల వృత్తులు చేయడానికి ప్రత్యేకమైన పరికరా లున్నాయి. ఆ కుల వృత్తుల వారికి ప్రత్యేకమైన వేష ధారణ, పదజాలం ఉన్నాయి. వీరికి ప్రత్యేకమైన కుల దేవతలు, ఆ కుల దేవతలకు ప్రత్యేకమైన ఆరాధనా

పద్ధతులు, ఉత్సవాలు, జాతరలు, కొలుపులు ఉన్నాయి. ప్రతి కులంలోను మళ్లీ శాఖలున్నాయి. ఈ శాఖలకు ప్రత్యేకమైన చరిత్ర ఉంటుంది. కొన్ని కులాల వారికి ప్రత్యేకమైన ఇంటి పేర్లు, గోత్రాలు ఉన్నాయి. వీటికి గూడా చరిత్ర ఉంటుంది. అంతేగాకుండా మరికొన్ని కులాలకు ప్రత్యేకమైన పండుగలు, ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, ఆహారపు టలవాట్లు ఉన్నాయి. ఇంకా కొన్ని కులాల వారికి ప్రత్యేకమైన జానపద కళలు గూడా ఉన్నాయి. ఇవన్నీ కలిసి ఆయా కులాల జానపద విజ్ఞానమనిపించు కుంటాయి. ఇలా ఉన్న ఈ కులాల జానపద విజ్ఞానాన్ని పరిశోధించి వెలికి తీయాలి. అప్పుడే మనం సమగ్రమైన్న జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేసిన వారమౌతాము.

జానపద సాహిత్యం జానపద విజ్ఞానం ఎక్కువగా లభించేది వెనుక బడిన ప్రాంతాల్లోనే. దీనికి కారణం వెనుకబడిన ప్రాంతాల్లోని ప్రజలు విద్యావంతులు, నాగరికులు, ధనవంతులు కాకపోవడమే. అలాగే కుల పరమైన జానపద విజ్ఞానం కూడా వెనుకబడిన కులాల వారైన యాదవులు, సాలీలు, శెట్టి బలిజలు, బెస్తలు మొదలైన వారిలోను, నిమ్న కులాలవారైన హరిజనులు, ఎరుకలు, యానాదులు, లంబాడీలు మొదలైన వారిలోను ఎక్కువగా లభిస్తుంది. అగ్రకులాల్లో కులపరమైన జానపద విజ్ఞానం లభించదు. దీనికి కారణం వీరు సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా విద్యాపరంగా అభివృద్ధి చెంది నాగరికులు కావడమే. ఇలాంటి వారిలో జానపద తత్వం కనిపించదు. అయితే దీనికి బ్రాహ్మణులు మినహాయింపుగా వున్నారు. బ్రాహ్మణులు సాంఘికంగా విద్యాపరంగా అభివృద్ధి చెంది నాగరికులుగా ఉన్నప్పటికి వీరికి సంప్ర దాయం మీద అభిమానం ఎక్కువ. శుభా శుభకార్యక్రమాల న్నింటిలోను వీరు సంప్రదాయాన్ని పాటిస్తారు. అంతే గాకుండా వీరికి పౌరోహిత్యం, దేవాలయాల్లో అర్చకత్వం, శుభకార్యాలకు ముహూర్తాలు నిర్ణయించడం మొదలైన ప్రత్యేకమైన కులవృత్తు లుండడం వల్ల, ఈ కుల వృత్తికి ప్రత్యేకమైన వేషదారణ పదజాలం ఉండడం వల్ల, వీరికి ప్రత్యేకమైన సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు నియమ నిష్ఠలు, ప్రత్యేకమైన ఇంటిపేర్లు,గోత్రాలు పేర్లు ఉండడం వల్ల బ్రాహ్మణుల జానపద విజ్ఞానాన్ని గురించి గూడా అధ్యయనం చేయవచ్చు.

ఒక్కొక్క కులం మీద కులపరమైన జానపద విజ్ఞానాన్ని ఈ క్రింది శీర్షికల ద్వారా అధ్యయనం చేయవచ్చు.

1. కులం పేరు- దాని వ్యుత్పత్తి - కుల చరిత్ర

ఇందులో పరిశోధన చేస్తున్న కులం పేరు, దాని పర్యాయ పదాలు ఆ పదాల వ్యుత్పత్తి, పూర్వగ్రంధాల్లో ఆ కులాన్ని గురించిన ప్రస్తావన, దాని చరిత్ర మొదలైన విషయాలను వివరించాలి.

2. శాఖా బేధాలు :

ఇందులో పరిశోధన చేస్తున్న కులంలోని శాఖా బేధాలు, వాటి ఆవిర్భావం, చరిత్ర మొదలైన విషయాలను వివరించాలి.

3. కులవృత్తులు :

ఇందులో పరిశోధన చేస్తున్న కులస్థుల కుల వృత్తులు, కులవృత్తులు చేయడానికి వారు ఉపయోగించే పరికరాలు, కులవృత్తులు చేసేవిధానం, అందులో వారి నైపుణ్యం, కౌశల్యం మొదలైన అంశాలుంటాయి.

4. ఇంటిపేర్లు, గోత్రాల పేర్లు :

ఇందులో పరిశోధన చేస్తున్న కులానికి ప్రత్యేకంగా ఉన్న ఇంటిపేర్లు, వాటి చరిత్ర, మిగిలిన కులాల్లోలాగా సాధారణంగా ఉన్న ఇంటిపేర్లు, వాటి చరిత్ర, గోత్రాల పేర్లు, వాటి చరిత్ర మొదలైన విశేషాలుంటాయి.

5. జానపద సాహిత్యం :

ఆంధ్రదేశంలో కొన్ని కులాల వారికీ సంబంధించి కొన్ని జానపద గేయాలు, కథాగేయాలు, కథలు, సామెతలు,పొడుపు కథలు, జానపద కళలు ఉన్నాయి. ఈ శీర్షికలో పరిశోధన చేస్తున్న కులస్తులకు సంబంధించిన జానపద సాహిత్యాన్ని గురించి అధ్యయనం చేయాలి.

గాయక భిక్షుకులు :

కొన్ని కులాల వారికి ప్రత్యేకంగా జానపద గాయక క్షుకులున్నారు. ఈ భిక్షుకులు ఆయా కులాలవారిని ందర్శించి వారి కులచరిత్రను, ఇంకా చాల విషయాలను ురించి గానం చేస్తూ ఉంటారు. ఈ శీర్షికలో కులస్తులను ూచిస్తున్న గాయక భిక్షుకుల చరిత్రను, ఆ కులం ురించి బిక్షకులు చెప్పే అన్ని విషయాలను గురించి ివరించాలి.

'. కుల దేవతలు :

యాదవులకు గంగ, సాలీలకు చౌడేశ్వరి కులదేవ తలుగా ఉన్నట్లుగానే మిగిలిన కొన్ని కులాల వారికి కుల దేవతలున్నారు. ఈశీర్షికలో కులస్తుల కులదేవతల గురించి, ఆ కుల దేవతలకు వారు చేసే ఆరాధనా పద్ధతులు, ఉత్సవాలు, జాతరలు, కొలుపులు మొదలైన వాటిని గురించి వివరించాలి.

8. మతం :

ఇందులో పరిశోధన చేస్తున్న కులం యొక్క మతం గురించి వివరించాలి.

9. వేషభాషలు :

ఇందులో ఆ కులస్తులు కులవృత్తులు చేసేటప్పుడు ఉపయోగించే ప్రత్యేక వేషధారణ,సాధారణ వేషధారణ, ఆ కులస్తుల ప్రత్యేక భాష, పదజాలం మొదలైన అంశాలను వివరించాలి.

10. వైద్యం:

పశుపాలన కులవృత్తిగా ఉన్నవారు తాము పెంచే పశువులకు వచ్చే అనేక రోగాలకు సాంప్రదాయకమైన వైద్యాన్ని వారే చేస్తూ ఉంటారు. ఈ శీర్షికలో పరిశోధన చేస్తున్న వారు కులస్తులు పెంచే పశువులను గురించి, వాటికి వచ్చే రోగాల గురించి, ఆ రోగాలకు వారు చేసే వైద్యాన్ని గురించి వివరించాలి.

11. ఆచార వ్యవహారాలు :

కొన్ని కులాల వారికి జననం, వివాహం, మరణం మొదలైన శుభాశుభ సందర్భాల్లో కొన్ని ఆచారాలు సంప్రదాయాలు ఉంటాయి. అంతేగాకుండా మరికొన్ని కులాల వారికి ప్రత్యేకంగా నియమాలు, నిష్ఠలు, పట్టింపులు ఉంటాయి. ఈ శీర్షికలో ఇలాంటి వాటి గురించి వివరించాలి.

2. సాంఘిక స్థితిగతులు :

ఇందులో పరిశోధన చేస్తున్న కులస్తులు ప్రస్తుతం సంఘంలో ఎలాంటి స్థానాన్ని కల్గి ఉన్నారు? గతంలో ఎలాంటి స్థానాన్ని కల్గి వున్నారు ? గతానికి ఇప్పటికి వారి సాంఘిక హోదాలో ఎలాంటి మార్పులు వచ్చాయి ? దానికి కారణాలు ఏమిటి ? మొదలైన విషయాలను వివరించడమే గాకుండా ఆ కులస్థులు ఇంకా సంఘంలో అధ్వాన్నంగా జీవిస్తూ ఉంటె వారి స్థితిగతులను మెరుగు పరచడానికి ఎలాంటి చర్యలు చేపట్టాలి మొదలైన విషయాలను గూడా ఈ శీర్షికలో వివరించాలి.

పైన చెప్పిన శీర్షికల్లోని విషయాలే గాకుండా ఇంకా పరిశోధన చేస్తున్న కులస్తుల కులం పేరుతోను, కులస్తుల ఇంటి పేర్లతోను ఉన్న ఊర్ల పేర్లు మొదలైన ఎన్నో అంశాలను గురించి గూడా కులపరమైన జానపద విజ్ఞానంలో అధ్యయనం చేయవచ్చు. ఆధునిక కాలంలో జానపద సాహిత్యంతో పాటు కులపరమైన జానపద విజ్ఞానం గూడా అంతరించి పోతూ ఉంది. ఇది పూర్తిగా అంతరించి పోకముందే ఆంధ్రదేశంలోని కులాల జానపద విజ్ఞానాన్ని గురించి పరిశోధించి, వెలికి తీయవలసిన బాధ్యత జానపద విజ్ఞాన వేత్తలందరి మీదా ఉంది.

**యం. జయదేవ్.**, రీడరు
ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం

# గానామృతలహరి- ఒక పరిశీలన

గేయ రచన కత్తిమీద సామువంటిది. గీతం రాగ తాళలయ భావాత్మకంగా వుండాలి. రసస్ఫోరకంగా వుంటూ సహృదయులైన పాఠకులకు రసానందాన్ని కలిగించాలి. ఏదో ఒక అనుభూతి, హృధయగ్రథనం కావాలి. గీతాలు రాయటం ఎంతకష్టమో ! భక్తి గీతాలు రాయటం మరీ కష్టం. అది భగవంతునిపై ప్రగాఢ విశ్వాసం వున్న వారికే సాధ్యమౌతుంది. శ్రీ దుత్తలూరి రామారావుగారు మంచి నటుడు. దాదాపు 42 సినిమాలలో నటించారు. ఈయన మంచి గేయరచయిత కూడా, అంతకంటే ముఖ్యంగా శ్రీ వేంకటేశ్వరస్వామి పరమ భక్తుడు. అందుకే ఆ స్వామి మీద ఆయన కొన్ని వందల పాటలు రాశారు. భక్తి పాటలు రాయటంలో శ్రీ దుత్తలూరి రామారావు గారిది అందె వేసిన చేయి. ఈయన రాసినన్ని దైవకీర్తనలు ఏ సినిమా కవి రాయలేదు. ఈయన రాసిన భక్తి పాటలు వందల సంఖ్యలో రికార్డయి క్యాసెట్ల రూపంలో విడుదలైనాయి. అన్నింటికంటె ముఖ్యంగా తనకులదైవమైన శ్రీ వేంకటేశ్వర స్వామిపై ఆయన రాసిన 101 గీతాలు 'శ్రీ వేంకటేశ్వర గానామృతలహరి' అన్న పేరుతో పుస్తకంగా వచ్చింది. అందులోని పాటలు ఆణిముత్యాలు. ప్రతిపాటా ఒక మణి దీపం. భక్తి రసం వుట్టిపడే ప్రతిగీతం ఒక సమయ కావ్యం. ప్రతి పాటలో భక్తి రసం సెలయేటి తరగల్లా గోదారి కెరటాల్లా పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తుంది. భక్తుల హృదయాలను పరవశింపచేస్తుంది. హృద యంతో కవి ఆలపించిన ప్రతి గీతంలో భావావేశం మధుర భక్తి పారవశ్యం విధారహృదయ పరవశత్వం అనంత విశ్వాసం, జాలి, ప్రేమ కరుణ వైరాగ్యం జాలువారాయి. ప్రతి పదంలో కవి ఆర్తిగేయమంతా మూర్తీభవించింది. ఆ పాటల్లోని భక్తిమాధుర్యాన్ని ఆస్వాదించండి. తొలుత ఈ కవి శేషాచలాన్ని వర్ణిస్తూ,

శ్రీకరము శుభకరము శేషాచలమూ
శ్రీ వేంకటేశ్వరుని స్థిర వాసమూ

అన్నారు. అంతేకాదు శ్రీ గిరి శిలలన్నీ సాల గ్రామములని, ఆ కొండలో చెట్లు సురకల్ప భూజాలని, విరజా నదీ జలమె హరిపాద తీర్థమని అమితానందంతో శేషాచలాన్ని వర్ణించారు. అంతటితో ఆగిపోక అక్కడి

పక్షుల పలుకులె ప్రణవాక్షరములు
మలయానిలములె మంత్రపుష్పములు
ఏడుకొండలవాని నెల్ల వేళలయందు
కొల్చెడి భక్తుల కొంగె బంగారము

అంటూ తిరుమల కొండలను భక్తి పారవశ్యంతో వర్ణించాడు. అంతేకాదు తిరుమల కొండలను వర్ణించుటలో అచ్చటి శిలలు, చెట్లు నీరు గంగాజలము ఒకటేమిటి, చివరకు పక్షుల కలకూజితాలు కూడా ఆనందమయమని పల్కుటలో వీరి భక్తి వికసించినది. భగవద్రూపము ఎంత చూచినా తనివి తీరదని తను కొల్చు వారికే కనుపించు కుసుమమది అన్నారు. భగవద్రూపదర్శనం ఎంత హృదయంగమమో ఆత్మైక వేద్యమేగాని ఎవరూ వర్ణింపలేరుకదా ! మానవ హృదయాలలో వ్యాపించి వున్న పరమాత్మను ఉపాసించు విద్వాంసులు మాత్రమే ఆత్మలయందు భగవంతుని ఉనికిని తెలుసుకోగలరు.

ఈ కవి శ్రీ వేంకటేశుని గుణగానం చేస్తూ ఇలా అంటారు.

శ్రీ వేంకటేశుని గానామృతం
చింతల తొలగించు భవభేషజం
కరుణా సముద్రుని కరుణామృతం
ఇహలోక పరలోక సాఫల్యం...

అంతేకాదు నాలుగు వేదాలలో సారమూ సర్వ శాస్త్రముల సారాంశమూ ! సర్వోపనిషత్తుల ప్రతిబింబమూ శ్రీ వేంకటేశుని గానామృతం. అంటూ ఎంతో నమ్మకంగా చెబుతా డీ కవి. ఇక శ్రీ వేంకటేశ్వరుని కరుణామృతం ఎలాంటిదంటే

నిండు చీకటుల చంద్రోదయం
మండు టెండలో హిమవర్షమూ
పండిత పామర జన రంజకం
భక్తాళి హృదయాల బ్రహ్మోత్సవం

అంటారు. భక్తుని హృధయం నిండుగా భక్తిరసం మనసులో ఉన్న భక్తాళి హృదయాలలో బ్రహ్మోత్సవం గాక వేరేముంటుంది ? తనకు ఎంత జ్ఞానమున్నా ఎన్ని కావ్యాలు రాయగల్గిన శక్తి వున్నా తామెంత పండితులైనా భక్త కవులు తమ కావ్యాలకు కృతి కర్తలు కృతిభర్తలు తాముకాదని తామారాధించే దైవాలని చెప్పుకుంటారు. అంతేకాదు తాము నిమిత్త మాత్రులమని రాసేది రాయించేది అంతా ఆ భగవంతుడే అంటారు. అది వారి వినమ్రతకు చిహ్నం. భక్తకవి పోతన పలికెడిది భాగవతమట పలికించెడు వాడు రామభద్రుండట అన్నారు. అలానే ఈ కవి కూడా తేనె లొలుకు పదాలతో తేలికైన మాటలతో

నీ పాట నా చేత వ్రాయించుకో
పరమాత్మ ప్రతినోట పాడించుకో

అంటారు. ఇక్కడ కవి తాను నిమిత్త మాత్రుడనని తప్పించుకుంటాడు. బాధ్యతంతా శ్రీ వేంకటేశ్వర స్వామికే వదిలేస్తాడు. ఇది ఈ కవి వినమ్రతకు నిదర్శనం. పైగా మందార మకరంద మాధుర్యముల విందు నీ గుణగానమని మురిసిపోతాడు. పరవశంతో భక్తప్రహ్లాదుడు తానై

కర్ణయుగంబుల పండువుగా
పున్నమి వెన్నెల సోనలుగా
ఆమని కోయిల నాదముగా
పండితులు పామరులు పరవశత్వమునంద

నీ పాట నాచేత వ్రాయించమంటాడు. ఆ పాటలు ఎలా ఉండాలి? పలుకులో సుధలు నింపి, భావములో భక్తి గొలిపి కలకాలము నీ మహిమలు పొగడెడి భాగ్యమ్ము నొసగెలా వుండాలని కవి శ్రీ స్వామి వారికి విన్నవించు కుంటాడు. వెంటనె స్వామివారి దివ్య మంగళ విగ్రహాన్ని స్మరిస్తూ,

పాడవె హరి పాట పాడుమనసా !
పాడించవే నోట ఓ పాడుమనసా !
హరిపాట హరిమాట ఆనందముల మూట

అంటూ ఎంతో అందంగా అలతి అలతి పదాలతో పాటలల్ల గలడీ కవి. ఈయన దృష్టిలో పాటంటే కేవలం పాట కాదు. ఆ పాట ఎలాంటిదంటే !

జగదభిరాముని సుగుణాలవాలుని
నిగమాగమమ్ముల ఆలపించెడి పాట
అఘము లణచు పాట సుఖములిచ్చెడి పాట
నగుమోముల స్వామి నారాయణుని పాట.

శ్రీ హరి పాట వేద వేదాంగముల విహరిస్తుందట. విశ్వమోహనమౌచు వెలుగందుతుందట అది తుంబుర నారదులు ఆడి పాటిన పాటట. నారదుడు గానకళలోని నిష్ణాతుడు. హరికీర్తనలు గానంచేసి చేసి తరించిన భక్తుడు. ఒకనాడు భగవంతుని ఉనికిని నారదుడు ప్రశ్నించగా మహావిష్ణువు "నాహం వసామి వైకుంఠే న యోగి హృదయేరవౌ మధ్భక్తా యత్రగాయంతి తత్ర తిష్ఠామి నారద" అని తెలిపినట్లు పురాణోక్తి. కనుక భక్తులు ఎక్కడ గానం చేయుదురో అక్కడ భగవంతుడు స్థిరముగా

వుంటాడని పెద్దల భావన. గానానికి భగవంతునికి వున్న సంబంధం తెలిసిన వాడగుటచే ఈ కవి పాడవే ఓ పాట ఓ పాడుమనసా అని తన మనసును ఆదేశిస్తాడు. అంతేకాదు

మనసు కోవెలలోని మాధవుడు కొలువుండ
తీర్థయాత్రలనన్ని తిరుగనేటికె మనసా !

అంటూ 'దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవ స్సనాతనః అని అనుకోగలడీ కవి. హృదయంలో శ్రీ వేంకటేశ్వరుడు వున్నాడనిం పది ఆరు వేల గోపాంగనలకు హృదయనాథుడు అతడేనని చెబుతూ

సత్యారుక్మిణి చానల మధ్యన
నిత్య వసంతుడు యెవడో
పదునారు వేల గోపాంగనలకు
హృదయనాథుడూ అతడే !

అంటాడు. ఈ గీతం చదువుతుంటే ఇద్దరు గదిసినారు యెదురుబడి వున్నారు. వొద్దు వొద్దనకు విమ్ము బోదించవలనె (శ్రీ తాళ్ల.ప.సా.సం.311పు4) అన్న అన్నమాచార్యుల కీర్తన చప్పున గుర్తుకొస్తుంది. ఇది పైకి శృంగార గీతంలా కనిపించినా అంతర్గతంగా ఆధ్యాత్మిక భావ విలసితమైన గీతమిది. అన్నమయ్య కూడా తన శృంగార కీర్తనలన్నీ లోపలి అర్థముతో ఆధ్యాత్మ పదముగా వర్ణించినాడని సాహిత్యజ్ఞులమాట. పైగా కృష్ణుని గోపికా హృదయనాథునిగా చెప్పుట ఎంతో సమంజసంగా వుంది. మధురకు వెళ్లిన తరువాత బలరామకృష్ణులు ఒకసారి గోపసుందరులను చూడవచ్చినపుడు గోపికలు

'నలిన దళాక్షుంజూచి నయనంబులు మోడ్వగజాల
కాత్మలన్ వలచి
తదీయ మూర్తి విభవంబు తలంపుచు'
(ఆ.మ.భాగ.దశః ఉత్తర 1063, 1064)

కౌగిలించుచు గోపికలు పులకించిపోయారట. బ్రహ్మమున్ మనంబునగనిన యోగులవలె చొక్కిపోయారట ఇది జీవాత్మ పరమాత్మల సంగమ స్థితి.

శతకోటి మర్కటముల మించునా మనసు
హరి నిన్ను గొల్వదు అది నీకు తెలుసూ
శ్రీ శేషశైలేశ ! శ్రీలక్ష్మిహృదయేశ
కరుణాంతరంగా కల్మషభంగా

అంటూ మనోస్థితిని తెలియచేస్తూ తనవారనీ రూపుకననీయవా మనసార నీ సేవ నాకీయవా? అంటూ శ్రీ వేంకటేశ్వరున్ని వేడుకుంటాడు.

దిన దినము క్షణ క్షణము
దిగులైన జీవనము
నీ పాద దాసులకు
తగునయ్య గోవింద

అని ప్రశ్నిస్తాడు. కన్ను తెరచినా కన్ను మూసినా రుణదాత రూపాలే మమ్ము భయభ్రాంతులను చేస్తూవుంటే పేదరికంతో నీ భక్తులు అష్టకష్టాలు పడుతుంటే

తనువెల్ల సొమ్ములను తగిలించుకొని తిరుగ
అంతమోజా నీకు శ్రీనాథ ! గోవిందా !

అంటూ శ్రీస్వామిని హేళన చేస్తాడు. స్వర్ణగర్భగా బిరుదుపొందిన భూదేవి, సమస్త సంపదలకు నిలయమైన శ్రీదేవి తన భార్యలై వుండగా ఇంకా భక్తుల వడ్డీపై బ్రతకడమేమిటని

కమలవాసిని లక్ష్మికాంతుడవగు నీకు
వడ్డికాసుల గుంజు వాంఛయెందుకు స్వామి

అంటూ శ్రీ వేంకటేశ్వర స్వామని అధిక్షేపిస్తా డీ కవి. మళ్లీ వెంటనే భక్తి పారవశ్యంలో పడిపోయి శ్రీ వేంకటేశుని చరణాలను స్మరిస్తూ

అందరి కందని పాదాలూ
భక్తులకవె సౌభాగ్యాలూ
కోటి సూర్యసమ తేజాలూ
శతకోటి చంద్ర సమ భాసాలూ !

తోలు బొమ్మలు మేము, సూత్రధారివి నీవు చరణ దాసుని పాత్ర నిరతము నాకిమ్మని ఈ కవి శ్రీ వేంకటేశుని

ప్రార్థిస్తాడు. ఆ పాదంపై ఈ కవికంత మక్కువ ఎందుకో ! బ్రహ్మకడిగిన పాదము కదా అది 'శ్రీరామ పాదమా చిత్తానికి తేవే' అని కదా త్యాగరాజుల వారి ప్రార్థన. మహా భక్తులైన పోతన కూడా భాగవతంలో శ్రీవారి పాదాల వర్ణనచేశాడు.

ఘోర సంసార సాగరోత్తారణంబు
ధీయుత జ్ఞానయోగి హృద్ధ్యేయవస్తు
వగుచు జెలువందు నీచరణాంబుజాత
యుగళమును మామనంబుల దగులనీవె !

(ఆ. మహాభాగ దశ. స్కం. ఉత్త 1070)

పద్యం రాసినా పాట రాసినా ఏ కవియైనా పఠితల హృదయాలన్నలా స్పందింప గలిగితే అతని కవిత ఒక లహరి. అది అమృతమయం ఆ కవితా గుణం ఈ కవి పాటల్లో వుంది. ఈతని హృదయం భక్తితో చిందులు వేస్తూ

సుందరి దేవకి కన్నయ్యా
నందయశోదల కన్నయ్యా
పది రూపంబుల వరదయ్యా
సదయా వేంకట రమణయ్యా

అంటూ అలవోకగా గంగా ప్రవాహం వలె సాగిపోతుంది. వెన్నెల వెరుగులు తిన్నయ్యా! కన్నెల సిగ్గు కొన్నయ్యా! అన్న చరణాలలో వేదాంత రహస్యాల లోతులు కూడా వున్నాయి. బాలకృష్ణుడు పరబ్రహ్మ. అతని చేష్టలు మానవాతీతాలు. వయసుకు మించినవి. అతని ఆకారం అనంత మహిమాన్వితం. అందుకే శ్రీ లీలాశుకుడు తన శ్రీ కృష్ణ కర్ణామృతంలో ఇలా అన్నారు. 'యా శేఖరే శ్రుతిగిరాం హృది యోగభాజాం. పాదాంబుజే చ సులభా వ్రజ సుందరీణాం గోపకిశోరమూర్తిః

మంచి పాండిత్యం చక్కని చమత్కార ఖేలనం కల్గిన ఈ కవి నోటిమాట పాటై పల్లవించిందా అనడానికి తార్కాణం ఈయన వర్ణించిన శ్రీ వేంకటేశ్వరస్వామి హస్తవర్ణన.

ఎంత చక్కని చేయి!
వింత సొబగులు చేయి
కంతు జనకుని చేయి
ఎంతయో హాయి!

ఆ చేయి ఎలాంటిదంటే వెలలేని వేదాలను వెదకి తెచ్చిన చేయి శ్రీ సతిని భూసతిని కౌగిలించెడి చేయి. బలిచేత దానమందిన చేయి. వడ్డికాసులను గొని లెక్కించుకొను చేయి! ఎంత వాస్తవ వర్ణన. ఈ కవి రచించిన కొన్ని పాటలు అన్నమాచార్య కీర్తనలను తలపించు చున్నవని డా॥ దివాకర్ల వేంకటావధాని లాంటి కవులే మెచ్చుకున్నారు.

ఆనంద నిలయాన అలరారుతున్నాడు
తేరి చూడకుమమ్మ దిష్టితగులును హరికి

అన్న ఈ కవికి శ్రీస్వామి వారిపై ఎంత మక్కువోకదా! అందుకేనెమో కొలువుండరా స్వామి నా కనులలో నిను దాచుకొందు నా కనురెప్పలో అంటాడు. అండగా నీవుండగా నాకేల గోషింద బంగారు కొండా! ఎందుకులే నీ కరుణ నామదినున్నది నీ నామస్మరణ అంటూ మురిపిసోతాడీ కవి. భక్త ప్రహ్లాదునిలా

నిదురించునపుడైనీ మేలుకొనునపుడైన
కలలయందున మెలకువలందున
మదిని నారాయణుని నామముండిన చాలు

అతడు సర్వాంతర్యామి ఇందుగలడందులేడని సందేహము వలదు అన్న ప్రహ్లాదునిలా " అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అన్న సూక్తిని ధ్వనింప చేస్తాడు పై పాటలో సర్వ శ్రీ వేంకటేశ్వరమయమని భావించే ఈ కవి.

' నా వేద హృదయమే నీకంకితం
నాలోని సర్వమ్ము భవదంకితం

అంటాడు. నా పాట నా మాట నా ఆట నా అరిషడ్వర్గాలు. నా రెండు శ్వాసలు నా ఆశ, నాధ్యాస నా అనెడి సర్వమ్ము

నీకంకితం అని ఈ కవి అన్నాడంటే భగవంతునిపై అచంచలమైన నమ్మకమున్న వారికే అది సాధ్యం. శ్రీ దుత్తలూరి రామారావుగారు సహజ పండితులవటంచేత వీరి పాటల్లో సాహిత్యం గుబాళిస్తుంది. పాట నడక పాఠకున్ని పరవశింపచేస్తుంది. అర్థం అమృతంలా అందుబాటులో వుంటుంది. భావం గుప్పున గుండెనిండా నిండుకుంటుంది. వీరు వాడిన అంత్యప్రాసలు వీరి సాహితీ పరిజ్ఞానానికి తార్కాణములు. వీరి పాటలు రాగ తాళ భావయుక్తంగా వుండటానికి కారణం వీరు చతుర్మాత్రాగణములు, పంచమాత్రాగణముల గీతాలు రాయటమే! కనుక తాళాను గుణమైన పదముల విరుపు వీరి పాటల్లో చోటు చేసుకొన్నది. యతి ప్రాసయతితో పాటు అంత్యప్రాసను ఎక్కువ గేయాలలో పాటించారని చెప్పవచ్చు. పల్లవికి చరణానికి అనుసంధానం కూర్చి చతుర రచన చేయుటలో ఈ కవి సఫలీకృతుడైనాడని చెప్పవచ్చు. ఈ కవి సినిమా పాటలెన్ని రాసినా అర్థంలేని పదాలు అశ్లీలం ధ్వనించే మాటలు ఈ కవి మేధను చేరకపోవటం ముదావహం. కొన్ని చోట్ల భక్తిని, కొన్ని చోట్ల వైరాగ్యాన్ని కొన్ని చోట్ల తత్వాన్ని కొన్ని చోట్ల విరక్తిని గుమ్మరించి రాసిన వీరి శ్రీ వేంకటేశ్వర గానామృతలహరి ఓ రసమయ కావ్యం. ఇందులోని పాటలన్నీ రసగుంభితాలు. ఈ పాటలకు పీఠిక రాస్తూ శతావధాని శ్రీ పేరాల భరత శర్మగారు ఇలా అన్నారు.

ఇది నూట ఒక్క పాటల తేనెల ఊట
పాట పాటకొక్క తెలుగుదనాల వెన్నెల బాట
బాట బాట భక్తి మొలకెత్తు ఒక్కపూలతోట

కళా ప్రపూర్ణ దివాకర్ల వేంకటావధాని ఈ పుస్తకానికి పరిచయ వాక్యాలు రాస్తూ, 'శ్రీ రామారావుగారు రచించిన కీర్తన లన్నియు చదివి, గానామృతలహరిలో కాదుకాని భక్త్యమృత ప్రవాహమున నోలలాడితిని. వారు రచించిన ప్రతి కీర్తనయు భక్తి రస భరితమై పఠితలకు శ్రోతలకు కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామి దివ్య సౌందర్యమును ప్రత్యక్షము చేయుచున్నది. ఈ కీర్తనలు అన్నమయ్య కీర్తనలను స్మృతికి తెచ్చుచున్నవి అన్నారు. ప్రముఖ కవి శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు.

'సిరు లీనెడి ఆ తిరుమల దొర
సిరమున కెక్కు తులసి దొంతరవలె ఈ
విరజాజి దండ గూర్చిన సరసు
డు రామయ్యసుకవి సామాధ్యుండె'

అని శ్లాఘించారు. ఇది అందరూ చదవ తగిన పుస్తకం.

జిల్లా వనరుల కేంద్రం
సేవామందిరం 515 212.
హిందూపురం

**హిందీ మూలం :**
**శ్రీమతి పారనంది నిర్మల**

**తెలుగు అనువాదం :**
**శ్రీమతి పారనంది నిర్మల**

సాయంత్రం నాలుగు గంటలైంది: అతిథులు రావడానికి యింకా గంటన్నర టైముంది. ఇంటిబైట షామియానాలు వేసి రంగు బల్బులతో అలంకరిస్తున్నారు. బాబు తండ్రి తెగ హడావుడి పడిపోతున్నాడు. సప్లయర్స్ నుంచి ఇంకా కొన్ని సామాన్లు రాలేదు. అయన ఫోను దగ్గరే తచ్చాడుతున్నాడు. ఫోన్ రింగయినప్పుడల్లా వాళ్ళే ఫోన్ చేశారేమోనని ఎత్తడం, అది రాంగ్‌నెంబర్ అవడమో, లేదా ఆయన స్నేహితులు ఫోన్‌లోనే బాబు బర్త్‌డే విషెస్‌చెప్పి తమ బాధ్యత వదిలించుకోవడమో జరుగుతోంది.

ఇంట్లో బాబు వాళ్ళమ్మ పనిమనిషి కలిసి సాయంత్రం ఫంక్షన్‌కి కావలసిన ఏర్పాట్లు చేయడంలో మునిగిపోయారు. ఇంట్లో కూడా డ్రాయింగ్ రూమ్‌ని బాగా అలంకరించారు. బాబు యింకా నిద్రపోతూనే ఉన్నాడు. వాడిని లేపాలి తయారు చెయ్యాలి. ముందు రోజు వానలో ఆడుకోవడం వల్ల బాబుకి కొద్దిగా జ్వరం వచ్చింది. సాయంత్రం ఫంక్షన్ టైముకి ఎక్కడ ఎక్కువయిపోతుందో అని మందులు గుప్పించి వాడిని నిద్రపుచ్చారు. వాడిని లేపాలి. అతిథులొచ్చి షేక్‌హాండ్ యిస్తే షేక్‌హాండ్ చేయడం, బహుమతి యివ్వగానే థాంక్స్, చెప్పడం - ఇలాంటి చిన్న చిన్న మర్యాదలు యింకా వాడికి చెప్పనే లేదు. నెమ్మదిగా వాడిని ఎలాగో నిద్రలేపి, కడుపునిండా తినిపించి తయారు చేసి డ్రాయింగ్ రూమ్‌లో కుర్చీలో కూర్చోబెట్టింది వాళ్ళమ్మ. ఎదురుగుండా టేబిల్ మీద అందమైన కేక్. బాబు ఆ కేక్ చూడగానే అది కావాలని సన మొదలు పెట్టాడు ఇంకా అప్పుడే కాదునాన్నా! అందరూ వచ్చాక నువ్వుకేక్ కట్‌చేద్దుగ్గాని, కట్ చేయగానే నువ్వే ముందు తినాలి" వాళ్ళమ్మ వాడిని సమాధానపరచలేక సతమతమై పోతోంది. కాని బాబుకి యీమర్యాదల గురించి ఏమి తెలుస్తుంది! పసివాడు చెప్పిచెప్పి విసిగిపోయి వాళ్ళమ్మ ఒక్కదెబ్బ వేసింది. బాబు ఏడుస్తూ, కళ్లనీళ్ళు తుడుచుకుంటూ వెళ్ళి మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు.

సాయంత్రం అయిపోయింది బాబుకిది ఆడుకునే వేళ. కాని యివాళ యిక్క డిలా కూర్చోవాల్సివచ్చింది పార్టీ అమ్మా, నాన్న చేసుకుంటే, బాగుణ్ణు. నన్నెళ్ళి ఆడుకోమనచ్చుకదా" అనుకుంటున్నాడు బాబు. ఇంతలో వాడి దృష్టి ఇంట్లోకి అప్పుడే వస్తున్న అతిథుల మీద పడింది. వాళ్ళ చేతుల్లో రంగురంగుల గిఫ్ట్‌పాకెట్స్, ఎంతబాగున్నాయి! "అరే! నాఫ్రెండ్స్ కూడా వచ్చారే. గ్రౌండ్‌లో మరి ఎవరు ఆడుతున్నారు?" నెమ్మదిగా అతిథులతో హాలు నిండింది. అమ్మా నాన్న లిద్దరూ మంచి బట్టల్లో మెరిసి పోతున్నారు. బాబు ధ్యాస అంతా కేక్‌మీదే. ఇది అందరికీ యిచ్చేస్తే తనకెలాగ? అనుకున్నంతా అయింది. మొత్తం కేక్ వచ్చిన వాళ్ళకే పంచేశారు? బాబు గుమ్మంవైపు చూశాడు. వాడి స్నేహితులకోసం. వాళ్ళంతా కలిసి రావడం లేదు. ఒక్కొక్కరు వాళ్ళ అమ్మా నాన్నలతో వస్తున్నారు. కనీసం వాళ్ళతో మాట్లాడ్డానికి కూడా బాబుకు వీలవడం లేదు. బాబుకి అదంతా వాళ్ళ స్కూల్‌డేకి చేసిన ఫాన్సీడ్రస్‌షోలా కన్పడింది. అందరూ వచ్చి బాబుకి గిఫ్ట్ యిస్తున్నారు. బాబు యాంత్రికంగా థాంక్స్ చెపుతున్నాడు. అమ్మా నాన్నలు వచ్చినవాళ్ళ మర్యాదలలో మునిగి పోయారు. ఇంట్లో నౌకర్లు అందింపులకే సరిపోయారు. అందరూ ముఖాన నవ్వు పులుముకుని మాట్లాడేవారే! బైటరంగుదీపాలు తళుక్కుమంటున్నాయి. ఆరుతూ వెలుగుతూ, హాలునిండా రంగు రంగుల బుడగలు.

గాలికి మెల్లగా కదులుతూ. బాబుకి ఒక్కసారి ఆ బుడగలు తీసుకొని ఆడాలనిపించింది. మళ్ళీ వాళ్ళ నాన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి. నాన్నా! అందరూ వెళ్ళే వరకూ బుడగలు కావాలని అడగకూడదు". పోనీ వాళ్ళు తెచ్చిన పాకెట్స్‌లో ఏముందో విప్పిచూస్తే! మళ్ళీ నాన్న మాటలు! అందరూ వెళ్ళేవరకూ మనం పాకెట్స్ విప్పకూడదు. ఎవరైనా చూస్తే ఒట్టి పిసినారివాళ్ళ మనుకుంటారు. ఎక్కడికక్కడే పాపం బాబు మనసు కట్టేసుకుంటున్నాడు. ఫ్రెండ్స్ మాటలు జ్ఞాపకం వచ్చాయి. బాబుకి, "ఒరే! మా అమ్మ నీపుట్టినరోజు కోసం బ్యాట్, బాల్ కొందిరా! మా అమ్మ కీయిస్తే నడిచే కారు కొందిరా!" నేను మాత్రం అమ్మతో ఖచ్చితంగా చెప్పేస్తాను. ఈ బొమ్మలన్నీ నావి. నేను ఆడుకోడాలనికే. షోకేస్‌లో సింగారించడానికి కాదు." అనుకుంటూ బాబు తనను తాను సమాధానపరచుకుంటున్నాడు.

నెమ్మదిగా బాబు కళ్ళమీదికి నిద్రవస్తోంది. బాబు కాళ్ళు నెప్పెడుతున్నాయి వాడికి సోఫాలోనే, అక్కడే నిద్రపోవాలనిపించింది. కాని వాళ్ళమ్మ అందరూ వెళ్ళేవరకూ నిద్రపోకూడదంది. ఈ హడావుడి అంతా నాకోసమేకదా! అమ్మ చెప్పినట్టు వినాలికదామరి! కాని యీ నిద్రేమిటి యిలాముంచుకొచ్చేస్తోంది! రాత్రి పది అయింది. ఒక్కొక్కరే అతిధులంతా వెళ్ళిపోయారు. హాలంతా ఖాళీప్లేట్లతో, గ్లాసులతో అస్తవ్యస్తంగా ఉంది. వీటన్నిటిమధ్యా నోట్లో వేలేసుకొని ఖాళీ కడుపుతో బాబు నిద్రతో జోగుతున్నాడు. మెలకువ వచ్చినప్పుడల్లా నాలుగైదు సార్లు 'అన్నం పెట్టమ్మా' అని అడిగి మళ్ళీ నిద్రలోకి జారుకుంటున్నాడు. "వస్తున్నానుండమ్మా' అంటూనే ఉంది ఆవిడ రావటం లేదు. ఆవిడ సంతోషంతో పొంగి పోతోంది. వచ్చి వాళ్ళంతాయింటి అలంకరణనీ, బాబుడ్రస్‌నీ, తన చీరనీ, నగలనీ మెచ్చుకున్నందుకు. అటుగావచ్చిన వాళ్ళమ్మ నిద్రతో జోగుతన్న బాబుని చూసింది. ఒక్కసారి ఆవిడ కళ్ళు చెమర్చాయి. పొంగుకొచ్చిన ప్రేమతో వాణ్ణి దగ్గరకు తీసుకొంది బాబు లేచాడు "అమ్మా! అందరూ వెళిపోయారా! అన్నం పెడతావా?" అన్నాడు వాళ్ళమ్మకి కడుపు తరుక్కుపోయింది. పరుగుతోవెళ్ళి కంచంలో అన్నంపెట్టి కళ్ళుతుడుచుకుంటూ వాడికి తినిపించింది.

పుట్టినరోజుకి యింత ఆర్భాటం అవసరమా! వాడి పుట్టినరోజున వాడికేం ఒరిగింది? పార్టీలో పెద్దవాళ్ళందరూ తింటుండగా వాడి బుజ్జిప్రాణం ఆకలితో నకనకలాడడమా! నిద్రపోవాలంటే కుదరదు. ఆడుకోవాలంటే కుదరదు. వాడినోట్లోని వేలే వాడి ప్రాణానికి కేక్‌లా అన్పించిందేమో! పిల్లవాడి కడుపు తెలుసుకోలేని యీ పార్టీలు, ఆర్భాటాలు ఎందుకు?" ఒక్కసారిగా యీ భావాలన్నీ ఆవిడ మనసులో సుళ్ళుతిరిగాయి.

★★

హిందీ అనువాదం : శ్రీమతి పారనంది నిర్మల, 'మున్నే కా జన్మదిన్', 'పూర్ణకుంభ్'
C/104, B.H.P.V. Township, Visakhapatnam - 12 (A.P)
తెలుగు అనువాదం : శ్రీమతి నళిని, MIG 68, Autonagar, Visakhapatnam.

హిందీ కథ

# గురు దక్షిణ

**- మూలం శ్రీ ఎమ్ ఉపేంద్ర**

*శ్రీ ఎమ్. ఉపేంద్ర గారు హైదరాబాదు వాస్తవ్యులు. కన్నడం వారి మాతృభాష. హిందీలో రచనలు చేస్తుంటారు. హిందీ ఆర్ట్స్ కాలేజీ నల్లకుంట హైదరాబాదు ప్రిన్సిపాల్. వారు ఇంతవరకు మూడు కథానికా సంపుటాలు వెలువరించారు. రాజధానీ మేం హనుమాన్ మొదటిది. భగవాన్ కా పతా రెండోది. ముఖ్యమంత్రీ కా వారస్ మూడోది. సునిశితమైన వ్యంగ్య రచనలో ఉపేంద్రగారు అందెవేసిన చేయి. వారి గురుదక్షిణ కథ స్రవంతి పాఠకులకు అందజేస్తున్నాము.* *- సంపాదకులు*

ఈ కాలంలో దేశమందంతటా గాలులు వీచడం ఎక్కువయింది. వీటి ముందు మాన్సూన్ గాలులు ఎందుకూ పనికి రావడంలేదు. రాజకీయంగా వీచే గాలులు మరీ తీవ్రంగా ఉంటున్నవి. వీటిమూలంగా ఎవరు ఏ స్థానం ఎప్పుడు అధిష్ఠిస్తారో చెప్పడం కష్టమవుతున్నది. అటువంటిదే ఒక గాలిలో రామదాసు ఎమ్.ఎల్.ఏ అయినాడు. అదే గాలిలో మినిష్టరు గూడా అయి కూర్చున్నాడు.

రామదాసు మినిష్టరు గావడంతో ఆ కాలేజీలో రకరకాల ప్రతిక్రియలు ఏర్పడ్డవి. అతడు ఆ కాలేజీ విద్యార్థి. అతడి విద్యార్థి జీవితంలోని విశేషమేమిటంటే - మూడు సంవత్సరాల కోర్సు పూర్తి చేయడానికి అతనికి ఏడేళ్లు పట్టింది. కాపీలు చేయడానికి అతనికి పూర్తి హక్కువున్నా పరీక్షలో మాత్రం పాసయ్యేవాడు గాడు. కాలేజీలో ఎక్కువ కాలం వుండడానికి ప్రయత్నం చేశాడు. అట్లా చేస్తేనేగదా నాయకత్వం రక్షింపబడేది !! అతడు మూడుసార్లు విద్యార్థి సంఘానికి కార్యదర్శి అయినాడు. రెండుసార్లు అధ్యక్షుడైనాడు. తరగతులకు హాజరుగాక పోవడం అతనికి జన్మసిద్ధంగా లభించిన అధికారం. అయినా హాజరీ అతనికి నూటికి నూరుపాళ్లూ లభించేది. విద్యార్జన తప్ప మిగతా పనులన్నీ అతడు బాగా చేసేవాడు. కాలేజీలో హడ్‌తాళ్ చేయించడంలో అతడు దిట్ట. హడతాల్ చేయించడానికి అతనికి కారణాలతో పని వుండేది గాదు. అతడు విద్యార్థి నాయకుడు గదా? నిమిషాలలో హడ్తాల్ చేయించేవాడు. అట్లా చేయడం వల్లనే అతని నాయకత్వపు పునాదులు గట్టిపడ్డవి. కాలేజీలోని విద్యార్థులు, విద్యార్థినులు అందరూ అతని మాట వినవలసిందే. వినకపోతే ఎప్పుడు ఏమి చేయిస్తాడో తెలిసేదిగాదు. విద్యార్థులు ప్రిన్సిపాల్‌కు చాలాసార్లు ఫిర్యాదు చేశారు. లాభం లేకపోయింది. ఒక విద్యార్థిని విసిగిపోయి అతనికి లాగి ఒక చెంపదెబ్బ ప్రసాదించింది. దానివల్ల అతడు పాఠం ఏమీ నేర్చుకోలేదు సరిగదా, పదిహేను రోజుల్లో ఆ విద్యార్థిని కాలేజీకి రావడం అసాధ్యమైపోయింది. చివరకు ఆమె కాలేజి మానివేసింది. అనాటి నుండి కాలేజీలో విద్యార్థినుల సంఖ్య తగ్గిపోయింది. కొంతమంది తెలివిగల ఆడపిల్లలు అతనికి రక్షా బంధనం కట్టి అతణ్ణి సోదరుణ్ణి చేసికున్నారు.

ఏడు సంవత్సరాలు రామదాసు ఆ కాలేజీలో మకుటంలేని రాజు. ప్రిన్సిపాల్‌కు గూడా అతణ్ణి చూస్తే భయం. ఉపాధ్యాయులందరూ అతనికి దూరంగా

వుండేవారు ఒకసారి ఒక కొత్త ఉపాధ్యాయుడు కాపీ చేస్తుంటే రామదాసును పట్టుకున్నాడు. ఇంకొక అనుభవశాలి అయిన ఉపాధ్యాయుడు ఆ కొత్త ఉపాధ్యాయుణ్ణి రక్షించవలసి వచ్చింది. విద్యార్థులు తమ సమస్యల పరిష్కారానికి ప్రిన్సిపాల్ దగ్గరకుగానీ, ఉపాధ్యాయుల దగ్గరకుగానీ పోయేవారు కాదు. రామదాసు దగ్గరికి పోయేవాళ్లు. ప్రతి సమస్యకు రామదాసు పరిష్కారం కనుక్కొనేవాడు. విద్యార్థులు ఎవరైనా అతనికి ఎదురు మాట్లాడితే వారు బాధలు అనుభవించవలసి వచ్చేది. అందువలన అందరూ అతనికి విధేయులుగా వుండేవాళ్లు. లేకపోతే గతిలేదు.

ప్రిన్సిపాల్మా, మిగిలిన ఉపాధ్యాయులూ రామదాసు తొందరగా కాలేజి వదలి పోవలెనని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ వుండేవారు. కాని భగవంతుడు వారి ప్రార్థనను అంగీకరించలేదు. ఆమధ్య అతడు మద్యం సేవించడం గూడా ప్రారంభించాడు. తరగతిలో ప్రిన్సిపాల్‌ను తూలనాడేవాడు. కుర్చీలు విసిరివేసేవాడు. విద్యార్థి సంఘం లెఖ్ఖలు ఎప్పటికీ తేలేవి కావు. అడగడానికి వీలులేదు. అతడు అడిగిన వెంటనే ప్రిన్సిపాల్ డబ్బు ఇవ్వాలి.

మన మెందుకు ఇంత బలహీనులమవుతున్నామని ప్రిన్సిపాలూ, ఉపాధ్యాయులూ ఆలోచించేవారు. కాని దానికి జవాబు దొరికేది గాదు. ఏడు సంవత్సరాలు కాలేజీ వాతావరణాన్ని అన్ని విధాలా చెడగొట్టి డిగ్రీ తీసుకోకుండానే రామదాసు కాలేజి వదలిపెట్టాడు. ఉపాధ్యాయులు శ్వాస పీల్చుకున్నారు. బ్రతుకుజీవుడా అనుకున్నారు.

మూడు సంవత్సరాలు రామదాసు ఎక్కడ వున్నాడో, ఏమి చేశాడో ఎవ్వరికీ తెలియలేదు. కాలేజీ చరిత్రలో అతడు భూతకాలంలో చేరాడు. అయినా అతని విద్యార్థి దశ అతనికి చాలా అను..భవం నెర్పినట్లున్నది. ఏ గాలిలో ఏమి జరిగిందో. ఏ గాలి ఎటువీచిందో రామదాసు చివరికి మంత్రి అయికూర్చున్నాడు. ఉపాధ్యాయులందరూ ఆశ్చర్యపడ్డారు. మొదట రామదాసును కాలేజీ నుండి వెళ్లగొట్టమని ప్రిన్సిపాల్‌ను వేదించిన కొంతమంది ఉపాధ్యాయులు తమ అభిప్రాయాలు మార్చుకున్నారు. వారు ప్రిన్సిపాల్ దగ్గరకు పోయి రామదాసు మన కాలేజీ విద్యార్థి. అతడు మినిష్టరు అయిన సందర్భంలో అతన్ని పిలిచి సన్మాన సభ ఏర్పాటు చేయడం అవసరమని చెప్పారు. ప్రిన్సిపాల్ అయోమయంలో పడ్డాడు. రామదాసు భూత కాలంలో చేరినవాడు ఇప్పుడు తిరిగి వర్తమాన కాలంలోకి చేరిపోయాడు. సరే ఆలోచిద్దామని ప్రిన్సిపాల్ అన్నాడు.

ఆలోచించడానికి ఆయనకు అవకాశమే దొరక లేదు. మూడు రోజులకల్లా ఆ భూతం ప్రిన్సిపాల్ గదిలోకి ప్రవేశించింది. రామదాసు గదిలోకి వచ్చి ప్రిన్సిపాల్ కాళ్లకు నమస్కరించాడు. ప్రిన్సిపాల్‌కు అది ఆశ్చర్యం కలిగించింది. అతడు గదిలోకి వస్తేనే ప్రిన్సిపాల్ భయ పడేవాడు. ఇప్పుడేమవుతుందోనని ఇంకా భయపడ్డాడు. రామదాసు ఒక కుర్చీమీద కూర్చున్నాడు. మీ దయవలన నే నీ స్థితికి చేరుకొన్నానన్నాడు. మీ మాట వినివుంటే నేనీ స్థితికి చేరుకునేవాణ్ణి కాదు కాని మీరు నాకిచ్చిన ప్రోత్సాహ యింపు వల్ల నేను మంత్రిని కాగలిగాను. నేను మంత్రి గావడానికి మీరు నాకిచ్చిన ప్రోత్సాహమే కారణం. సెలవి వ్వండి. మీరు ఏది చెప్పితే అది చేస్తానన్నాడు రామదాసు.

ప్రిన్సిపాల్ కొంచెం సర్దుకున్నాడు. ఆయన జీవితంలో ఇది వొక విచిత్రమైన ఘడియ. రామదాసు గౌరవాన్నంతా ప్రిన్సిపాల్ మీద వేస్తున్నాడు. ప్రిన్సిపాల్ ఏమీ మాట్లాడలేని స్థితిలో వున్నాడు. రామదాసు అంతా

గమనిస్తూనే వున్నాడు. తను అనుకొన్న దానిని ప్రిన్సిపాల్ అంగీకరించిందిందాకా విద్యార్థిగా వున్నప్పుడు వదిలేవాడు గాడు. సర్, వెనకటి మాటలు మరచిపోండి. మీరు నాయకుడు గావడానికి నాకు సహాయం చేశారు. నేను గూడా నా కాలేజీకి, నా ప్రిన్సిపాల్‌కు ఏదైనా చేయాలి. మీరే సెలవివ్వండి అన్నాడు రామదాసు.

"అయితే సరే. నా వల్లనే నీ వింత వాడవయినా నంటున్నావు. అవునా?"

"అవును సర్. మీ విశాలహృదయం వల్లనే నేనీ స్థితికి చేరుకున్నాను"

"అయితే నన్ను నీవు గురువుగా భావిస్తున్నావన్న మాట".

"గురువేమిటి? సర్, మీరు నన్ను నిర్మాణం చేశారు' ' నేనింత వాణ్ణి గావడానికి మీరే కారణం".

"అయితే నాకు గురుదక్షిణ ఇస్తావా?" అన్నాడు ప్రిన్సిపాల్.

మీరు సెలవివ్వడం తరువాయి. కాలేజీకి అడ్‌హాక్ గ్రాంటు కావాలా? మీకు నేషనల్ అవార్డ్ కావాలా? చెప్పండి సర్.

"తరువాత మాట తప్పవు గదా?"

"లేదు సర్. సెలవివ్వండి. చేసి చూపిస్తాను".

అయితే నేను గురుదక్షిణ కోరుకుంటున్నాను. విను. ఈ రోజునుండి నీవెప్పుడూ ఎవరి ముందూ నీ వీ కాలేజి విద్యార్థివనీ గానీ నేను నీకు గురువునని గానీ చెప్పగూడదు. మాట ఇవ్వు" అన్నడు ప్రిన్సిపాల్.

రామదాసు తానిచ్చిన మాట నిలబెట్టు కుంటున్నాడా !!!!



పుస్తక సమీక్ష

# ఆరు నెలల తెలుగు కవితలు - ఒక సమీక

- శ్రీ గొల్లపూడి ప్రకాశరావు

సాహిత్యాభివృద్ధికి సమీక్షలు ఎంతోకొంత సహాయపడతాయని అందరూ అంగీకరించిన సత్యం. సమీక్షలు పలు విధాలు. ఒక గ్రంథాన్ని సమీక్షించవచ్చు. ఒక రచయిత గ్రంథాలన్నిటినీ సమీక్షించవచ్చు. ఒకే లక్ష్యంతో రచింపబడిన గ్రంథాలన్నిటినీ సమీక్షించవచ్చు. ఒక పరిమితకాలంలో వ్రాయబడిన గ్రంథాలను సమీక్షించ వచ్చు. ఈ చిట్టచివరి కోవకు చేరిన గ్రంథం సూర్యదేవర రవికుమార్ గారి "ఆరు నెలల తెలుగు కవితలు - సమీక్ష"

ఒక సంవత్సరకాలంలో వచ్చిన సాహిత్యాన్నంతటినీ సమీక్షించి పాఠకులను సంతోషపెట్టే కార్యక్రమం ఎప్పుడు ప్రారంభమైనదో గాని ప్రచారంలోకి వచ్చింది మాత్రం 'శ్రీ వాత్సవ' సమీక్షలతోనే. ఇటీవలి కాలంలో ఆంధ్రజ్యోతిలో డాక్టర్ రామమోహనరాయ్ ఈ సమీక్షా కార్యక్రమాన్ని సమర్థంగా నిర్వహిస్తున్నారు. అయితే స్థలాభావం వలన ఈ సమీక్షలు సంగ్రహంగానే తప్ప సమగ్రంగా ఉండే అవకాశం లేదు.

| | | |
|---|---|---|
| పుస్తకం పేరు | - | ఆరు నెలల తెలుగు కవితలు |
| రచయిత | - | సూర్యదేవర రవికుమార్ |
| వెల | - | రు. 15-00 |
| ప్రతులకు | - | సూర్యదేవర స్వరూపరాణి<br>భట్టిప్రోలు, గుంటూరు జిల్లా |

సంవత్సరకాలంలో వచ్చిన సాహిత్యాన్ని సమీక్షించడం అంటే కొండను అద్దంలో చూపించినట్లవుతుందనీ, అంతకంటె తక్కువ సమయాన్ని తీసుకుంటే, సమీక్షను కవిత్వానికి మాత్రమే పరిమితం చేసుకుంటే కొంతకు కొంత వివరంగా వ్రాయవచ్చనీ భావించారు శ్రీ సూర్యదేవర రవికుమార్‌గారు. ఆరునెలల కాలంలో వచ్చిన తెలుగు కవితలను సమీక్షించారు. ఈ బృహత్సమీక్షా వ్యాసాన్ని ధారావాహికంగా వెలువరించిన "స్రవంతి" సాహిత్యాభిమానం అభినందనీయం.

రవికుమార్ శాస్త్రీయ దృష్టిగల వ్యక్తి. వారి వృత్తిలో శాస్త్రీయత ప్రధానం. వారి ప్రవృత్తిలో గూడా శాస్త్రీయ దృష్టి అధికం. శస్త్ర విద్యా నిష్ణాతులైన రవికుమార్ 1986 ప్రారంభం నుండి అర్ధ సంవత్సరకాలంలో వెలువడిన కవితల నన్నిటినీ విమర్శ శస్త్ర ప్రయోగం ద్వారా పరిశీలించి గుణదోష నిరూపణ గావించారు. ఈ కవితల వర్గీకరణలో, పట్టికల ప్రదర్శనలో ఎంతో జాగరూకతను ప్రదర్శించారు. ఈ కాలంలో వెలువడిన కవితలను రూపాన్ని బట్టి, విషయాన్నిబట్టి వేర్వేరు పట్టికల రూపంలో ప్రదర్శించారు. రచయితల, రచయిత్రుల సంఖ్యను నిర్దేశించారు. వృత్త సీసగేయాది ఛందోభేదాల సంఖ్యను వివరించారు. మొత్తం 587 మంది రచయితల 1149 కవితలను పరిశీలించే బృహత్తర భారాన్ని వారు నిర్వహించారు. కవితా విషయాన్ని బట్టిగూడా వీరు మరో విధమైన విభజన గావించారు. కవిత, ప్రకృతి చిత్రణ; పండుగలు; జీవితము, స్త్రీ గత ప్రేమ కవితలు; సామాజిక స్పృహ; తిరుగుబాటు కవితలు; నిరాశాగీతాలు; స్మృతి గీతాలు; స్తుతిగీతాలు, దైవభక్తి; దేశభక్తి; దైనందిన సంఘటనలు మొదలైన అనేక విషయాలుగా విభజించి అందలి గుణదోషాలను

చర్చించారు.

ప్రతి శీర్షికను గూర్చి వివరించే సమయంలో ఆయా కవుల కవితా పాదాలనే ఉపయోగిస్తూ రవికుమార్‌గారు రచన సాగించారు. దాదాపు ప్రతి ఉదాహరణ తర్వాత ఆ భావాన్ని గూర్చి తన భావం ఏమిటో గూడా వివరించారు.

"లండన్‌లోని థేమ్స్ నదివలె
వాషింగ్టన్‌లోని పాటామిక్ రివర్‌వలె
వియన్నాలోని వీథికుల్యలవలె
పరిశుద్ధంగా మూసీ ఎప్పుడూ ప్రవహించవలె"

అని వెనిస్ నగరంలోని వీధికుల్యలను వియన్నాలో నివిగా వర్ణించి నందుకు కవితా శరథి దాశరథినీ,,

"ఆశయాల అంగట్లో అన్నీ వున్నాయి
అల్లుని నోట్లో శని తప్ప"

అని ప్రసిద్ధ సామెతను విపరీతార్థంలో ఉపయోగించినందుకు జ్ఞానపీఠ అవార్డు గ్రహీత నారాయణరెడ్డిగారిని "ప్రమాదోధీమతానుపి' అనే పెద్ద వాక్యాన్ని ఉదాహరిస్తూ సున్నితంగా విమవర్శించడం ఇందుకు ఉదాహరణం. గుణం ఏ మాత్రం ఉన్నా ఆయా రచయితలు రవికుమార్ గారి ప్రశంసలకు పాత్రమైనందుకు గ్రంథం అంతా ఉదాహరణమే.

ఆరు నెలల కాలంలో వచ్చిన కవుల కవితలలోని వివిధాంశాలను వారి ఖండికలలోని కవితా భాగాలను ఉపయోగిస్తూ వివరిస్తూనే రవికుమార్‌గారు తన స్వీయాభిప్రాయాలను గూడా ప్రకటించారు.

"ప్రకృతిని ప్రేమించని, చిత్రించనివాడు కవి శబ్దవాచ్యుడు కాజాలడు".

"ప్రకృతితో పాటు చక్రగతిగా తిరిగే పండుగలు జనజీవిత సంస్కృతీ దర్పణాలు"

జీవితాన్ని, జీవితపు విలువలను కవిత్వం చిత్రిస్తుంది, తర్కిస్తుంది"

"కవిత్వం మానవ జీవితానికి ఆదర్శ మార్గాలను చూపుతుంది."

"తెలుగు కవిత్వం పుట్టిన దగ్గరనుండి ఏనాడూ, ఇంత వైవిధ్యంతో సామాజిక స్పృహ అందులో చోటు చేసుకోలేదు."

"ప్రతీకలు సాధారణ పాఠకుడికి అంత తేలికగా అర్థం కావు. వ్యాఖ్యానంతో ప్రచురిస్తే ఎంతో మేలు జరుగుతుంది. ప్రతీకాత్మకమైన ఆరుద్రగారి 'త్వమేవాహమ్' కావ్యాన్ని ఇంతవరకు సమగ్ర వ్యాఖ్యతో వెలువరించని మన సాహిత్య స్తబ్ధతను వదిలించుకోవాలి.

ఈ సమీక్షా గ్రంథం మొత్తం పేజీలు 62. అందులో 42 పుటలు ఈ సమీక్షా కాలంలో వచ్చిన కవితలను వివరించడానికి కేటాయించగా దాదాపు 20 పుటలను ఈ కవితలలోని గుణదోషాలను చర్చించడానికే కేటాయించారు. భాషా విషయంలో, ఛందో విషయంలో, రసాలంకార విషయంలో రవికుమార్‌గారి అభిప్రాయాలకు దర్పణం ఈ గుణదోష చర్చా విభాగం.

రవికుమార్‌గారికి ఛందోబద్ధ రచనలపై అభిమానం అధికం. ఆ ఛందం అక్షరగణ బద్ధం కావచ్చు. మాత్రాగణ బద్ధం కావచ్చు. భావగణ బద్ధమైన వచన కవిత కావచ్చు. ఏది యేమైనా అంతర్లీనంగా నైనా లయ ఉండడం ముఖ్యం అనీ, యతి ప్రాసలు కేవలం అలంకారానికే కాదు, వాటి ప్రయోజనం ఎంతో ఉన్నది అనీ ఉదాహరణ పూర్వకంగా నిరూపించడమే కాకుండా ఈ ఆరునెలల కాలంలో వచ్చిన కవితలు ఏయే ఛందో రీతులలో ఉన్నాయో వివరించి చూపించారు. కొన్ని కవితలు కుంటి నడకతో ఉన్నాయని అధిక్షేపించారు. దివాకర్‌గారి 'వేయి వెలుగులు' అనే కవితను పరిశీలించి "భావావేశానికి తగిన లయ ఆ కవితలో కన్పించదు. కవితలో పేలవ పదజాలం లేకపోయినా తగిన లయ లోపించడంతో సౌందర్యం

కొరవడింది అని విమర్శించారు.

ఛందస్సును గూర్చి వీరు వెలువరించిన కొన్ని అభిప్రాయాలతో చేకూరి రామారావుగారు విభేదించారు. కాని భావంతోపాటు రూపంగూడా రమణీయంగా ఉండాలని కోరుకోవటంలో దోషం లేదు. అలా ఉండాలని కోరుకున్న రవికుమార్‌గారు అభినందనీయులే.

భాషా విషయంలోగూడా రవికుమార్‌గారు శుద్ధతను కోరుకుంటారు. తగినంత శబ్దార్థ జ్ఞానంలేని రచయితలు రచనలు చేయటం, వ్యావహారికం పేరుతో విచ్చల విడితనం ప్రదర్శించటం నేటి రచనల లోని భాషా దోషాలకు కారణాలని భావించారు. అక్షరజ్ఞానం లేని రచయితల శబ్దదోషాలను, వైరి సమాసాలను, విపరీతక్రియా ప్రయోగాలను ఉదాహరించారు. కర్కశం, శ్యామల, శైత్యం అనే పదాలను కర్కషం, స్యామల, సైత్యంగా వ్రాయటం రవికుమార్ గారికేకాదు భాషాభిమానులెవరికైనా బాధ కలిగిస్తుంది. భాషా విషయంలో ఇంతస్వేచ్ఛ తగదని వారితోపాటు మనమూ అంగీకరిస్తాం.

ప్రాచ్య పాశ్చాత్య కవితా రీతులన్నిటితో తగినంత పరిచయం గల వ్యక్తి అయినా రవికుమార్‌గారు ఆంధ్రాభిమానం అధికంగా ఉన్నవారే. "తెలుగు కవిత్వం... జాతీయస్థాయిలోనే గాక అంతర్జాతీయ స్థాయిలో గూడా తగిన గుర్తింపు పొందాలని" వీరి ఆశ. అయితే తెలుగు కవితా కీర్తి విశ్వవ్యాప్తం కావాలని కోరుకున్న రవికుమార్ గారు తెలుగు కవుల పేర్లను సూచించే విధానంలో తెలుగుదనాన్ని విస్మరించటం విచారకరం. వారు అవలంబించిన పద్ధతి శాస్త్రీయం కావచ్చు. కాని ఆత్మీయంకాదు. ఆంధ్రత్వ సూచకం కాదు. ఇంటిపేరు తర్వాత వ్యక్తిపేరు ఉండటం ఆంధ్రుల సంప్రదాయం. ఇంటిపేరు చివర రావటం మన పద్ధతి కాదు. సూర్యదేవర రవికుమార్‌గానే తన పేరును ప్రకటించుకున్న రవికుమార్‌గారు అనంతర సమీక్షా గ్రంథాలలో తెలుగు పద్ధతిని అవలంభించి ఆంధ్రుల కానందం కలిగిస్తారని ఆశిస్తున్నాను. ★ ★ ★



# హిందీ విజయపత్ర వితరణోత్సవము

ది. 27 డిశంబరు 96 సాయంత్రం 5-30 గం.లకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర), ఖైరతాబాద్ ఆవరణలో హిందీ ప్రేమీమండలి, హైదరాబాద్ ఆధ్వర్యంలో విజయపత్ర వితరణోత్సవం జరిగింది. 96 ఫిబ్రవరిలో జరిగిన ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష, ప్రవేశిక పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు విజయ పత్రములు మరియు సర్వ ప్రథమ, సర్వ ద్వితీయ, సర్వ తృతీయ స్థానములలో ఉత్తీర్ణులైనవారికి బహుమ తులు ప్రదానము చేయుటకై ఈ కార్యక్రమము ఏర్పర్చబడినది.

ముఖ్యఅతిథిగా విచ్చేసిన శ్రీ యం.వి.యస్. ప్రసాద్, ఐ.ఎ.యస్. సాంకేతిక విద్య మరియు దేవాదాయ, ధర్మాదాయ శాఖల కమీషనర్‌గారు తమ సందేశంలో “విద్యార్థుల మాతృభాష మరియు అంతర్జాతీయ భాషలతోపాటు ఇతర భాషలు కూడా నేర్చుకోవాలనియు, అపుడే వారు ఇతర ప్రాంతీయులకు, ఇతర దేశీయులకు సన్నిహితం కాగలరనియు వారిని చక్కగా అర్థం చేసుకోవటానికి వీలువడుతుందనియు చెప్పారు. భాషలు నేర్చుకోవటానికి రేడియో, టి.వి. వంటి సమాచార మాధ్యమాలు బాగా ఉపయోగపడతాయని అన్నారు.

సభా ప్రారంభంలో హిందీ ప్రేమీ మండలి కార్యదర్శి శ్రీ యస్. సత్యనారాయణ ముఖ్య అతిథికి, సభికులకు స్వాగతం చెప్పారు.

హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తి కార్యక్రమానికి అధ్యక్షత వహిస్తూ, అందరూ మాతృభాషతోపాటు హిందీ నేర్చుకోవాలనియు, ఈ రెంటి తర్వాతే ఆంగ్ల భాషాస్థానమని చెప్పారు. మాతృభాష తెలుగు, జాతీయ భాష హిందీ రెండు కళ్ళవంటివనియు, ఇంగ్లీషు కళ్ళజోడువంటిదనియు ఉపమానంగా చెప్పారు. పాఠశాలల్లో ద్వితీయ భాష హిందీ బోధన ఐదవ తరగతి నుండే ఏర్పాటు చేయాలనియు హిందీ పీరియడ్లు పెంచవలెననియు, ఉత్తీర్ణతా అంకములు 35 శాతము చేయవలెననియు, హిందీ సంబంధిత ఖర్చును రాష్ట్ర బడ్జెట్‌లో కేటాయించవలెననియు రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరారు.

ద.భా. హిందీ ప్రచార సభ (ఆంధ్ర) కార్యదర్శి శ్రీమతి కె. విమలాబాయిగారు మాట్లాడుతూ హిందీ ప్రచారానికి దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఎంతో కృషి చేస్తున్నదనియు, ప్రాథమిక నుండి ప్రవీణ వరకు పరీక్షల నిర్వహణ, శిక్షణలతోపాటు, హిందీ ప్రచారక విద్యాలయాలు, బి.యడ్. కళాశాలలు, స్నాతకోత్తర కేంద్రాలు, పరిశోధనాత్మక తరగతులు నిర్వహిస్తున్నదని చెప్పారు. హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులై విజయ పత్రాలు తీసుకోవటానికి వచ్చిన విద్యార్థులకు శుభాకాంక్షలు తెలుపుతూ హిందీ అభ్యసించి జాతీయ సమైక్యతకు తోడ్పడమని సలహా యిచ్చారు. భారతదేశంలోని విభిన్న భాషీయులను ఏకసూత్రంలో బంధించే భాష హిందీయనియు దీనికి మహోజ్వల భవిష్యత్తు కలదన్నారు. జాతీయ భాష జాతికి వాణి వంటిదనియు, అది లేని జాతి మూగదనియు ఉపమించి చెప్పారు. సర్వశ్రీ గోదా తిరుమలయ్య, చవాకుల రామకృష్ణారావు పాల్గొన్నారు. హిందీ ప్రేమీ మండలి ఉపాధ్యక్షుడు శ్రీ జి. ఉమా మహేశ్వరరావు వందన సమర్పణ చేశారు. జాతీయ గీతాలాపనతో కార్యక్రమం ముగిసింది.

